# 11-12

ప్రజోత్పత్తి  1991

సంపాదకులు

తంగిరాల సుబ్బారావు

ఆర్వీయస్. సుందరం



చైతన్య కవితా వేదిక

బెంగుళూరు

CHAITANYA KAVITA a journal devoted to Telugu Poetry,
Published by Chaitanya Kavita Vedika
R-2, Jnanabharati, Bangalore University Campus, Bangalore-56
1991, pp. viii + 56.

ముఖచిత్రం : శ్రీ వేగుంట మోహనప్రసాద్ 5 copies
వెనుకవైపు : శ్రీ ఉత్పల సత్యనారాయణాచార్య 5 copies
అక్షరాలంకరణ : డా. పి. సి. నరసింహారెడ్డి 1

10-00 (ప్రత్యేక సభ్యత్వం రూ. 100-00;
జీవిత సభ్యత్వం రూ. 200-00)

ఇతర వివరాలకు :

Prof. T. V. Subba Rao
Head of the Department of Telugu
Bangalore University
Jnana Bharati, Bangalore-560 056

రచనలు పంపాల్సిన విరునామా :

Prof. R. V. S. Sundaram
Dean, School of Literature
Telugu University
Rajahmundry Campus
Bommur-533 124 (A.P.)

ముద్రణ :
మిత్ర ప్రింటర్స్, విద్యారణ్యపురం, మైసూరు-8.

# మనవి

'చైతన్య కవిత' అన్ని సాహిత్య పత్రికలలాగే కొంతకాలం వచ్చి, పది సంచికల్ని పాఠకులకు అందించి మెల్లగా తప్పుకుందనే చాలామంది అనుకున్నారు. నిజానికి సాహిత్య పత్రిక నడపడం, అదీ తెలుగులో, కష్టసాధ్యమేకాదు అసాధ్యమనుపిస్తుంది. సంవత్సరానికి పైగా చైతన్య కవిత పాఠకులకు కనిపించకపోవడానికి ముఖ్య కారణం ముద్రణాలయం ఇబ్బందులు. సంపాదకుల్లో ఒకరైన ఆర్వీయస్ సుందరం రాజమండ్రి వెళ్ళడంవల్ల మైసూరులో జరుగుతుందిన ముద్రణ ఆగిపోవలసి వచ్చింది. ప్రజోత్పత్తి సంవత్సరానికంతటికీ కలిపి ఈ సంచికను తీసుకురావడం జరిగింది. అంగిరస సంవత్సరానికి త్వరలోనే సంచిక ప్రచురణ మొదలవుతుంది. కవితాభిమానుల సహకారానికి మరోమారు ధన్యవాదాలు.

జూన్, 1992 — సంపాదకులు

# ఈసారి వేదికనలంకరించినవారు

# పురానవ కవి 'మో'

—సీతారాం

దాదాపుగా పాతికేళ్ళ క్రిందట కడుపేద రైతులాగా 'చితి-చింత'తో వచ్చిన కవి మోహన ప్రసాద్. పొలంనుంచి వచ్చిన రైతంత సహజంగా మోహనప్రసాద్ కవిత్వంలోంచి నడిచి వచ్చినట్లుగా అన్పించాడు. అప్పటికీ ఇప్పటికీ తన 'కాలి బాట' తనదే తప్ప వేరే దారుల్లోకి ఆయన 'పాదం' మోపలేదు, పైగా తన దారి తాను చూసుకున్నాక కూడా 'ఏదీ దారి నాకు' అంటూ గొణుగుతూండటం కవిత్వాభిమానులకి వినబడిన విషయమే.

ఈ నిరుపేద రైతు చాలా కవిత్వాన్ని ఈ 30 ఏళ్ళలోనూ పండించాడు, ఈవిషయాన్ని సాహిత్యకులుగుర్తించినా-అత్యంత వివాదాస్పదుడయిన ఈ కవి విషయంలో ఇంకెంతో చర్చ జరగవలసి వుంది. చాల విషయాలు నిగ్గుదేలవలసివున్నాయి.

అయితే 'చితి-చింత'లో మోహన ప్రసాద్ 'వస్తుగతంకాని, కవితకు భావం' బలం అంటూ స్పష్టంగా ప్రకటించాడు. వేగుంట మోహన ప్రసాద్, కవిత్వంలో వస్తుప్రాధాన్యతను నిరాకరించాడు అనేది స్పష్టంగానే తెలుస్తున్న విషయాన్ని 'అత్యంత సహజంగా'నే గుర్తించలేక పోయింది సాహితీలోకం. మోహన ప్రసాద్ కవిత్వం గురించిన సరయిన అవగాహన కలగడానికి సాహిత్య-విమర్శకులు ఎవరూ ప్రయత్నించిన దాఖలాలూ మనకు కనిపించవు. వెరసి ఈ కొత్త తరహా కవిత్వాన్ని అర్ధం చేసుకోవడానికి మార్గాలు వెతుక్కోలేక కలవరపడ్డారు.

ఏ కవితలోనైతే వస్తువు 'ఫలానా' అనేది కాంక్రీట్‌గా ఉండదో ఆ కవితకు కవి 'భావం' (Idea) బలాన్నిస్తుందని. ఈ భావమే వస్తువుగా మారగలదని కవి చెప్పాడు. మోహన ప్రసాద్ విషయంలో చాలామంది దారితప్పడానికి కారణం ఈ 'క్లూ'ని అందుకోలేక పోవడమేనని నాకు అనిపిస్తుంది. అయితే ఎవరు ఎంత దారితప్పినా కవి నేటికీ ఇదే అంశం పైన నిలబడి ఉన్నాడు. ఈ పాతికేళ్ళుగా తాను ప్రకటించిన విషయాన్ని బలపరుస్తూన్నట్లు అన్పించే కవిత్వాన్ని రాశాడు.

కవిగా మోహన ప్రసాద్ కవిత్వ విమర్శకు ఒక సవాలుగా నిలిచాడు. ఆయన చాలా అంశాలని తన కవిత్వం ద్వారా చర్చకు తీసుకు వచ్చాడు.

అవన్నీ సాహితీ విమర్శకుల బద్ధకం బాటునా Ignorance ఎల్ల ఫలితం లేకుండా పోయాయి.

చితి-చింతలో "ఉన్న దొక్కటే బాడీయే/దాన్ని గూర్చినవే ఇక నా పాటలూ పజ్యాలు" అని. ఆత్మకంటే దేహం గొప్పదని నిర్ద్వందంగా చెప్పే శాడు. ఆత్మనొక అబద్ధంగా చిత్రించాడు. దేహానికున్న బట్టలు 'ఉప్పదీశాడు' అవసరమైనట్లు. ఇంకేముంది తెలుగువాళ్ళకి విస్మయం. నిజానికి తెలుగు సాహిత్యంలో ప్రతిప్రక్రియ కనీసం వందఏళ్ళు వెనుకబడి వుంటుంది ప్రపంచ సాహిత్యంతో పోల్చినప్పుడు. కవిగా మోహన ప్రసాద్ 'చితి-చింత' నాటికి అందుకున్న ఆధునికతని కవిత్వ విమర్శ అందుకోలేకపోయింది. దానివల్ల నష్టం ఆధునిక కవికీ, కవిత్వానికీ జరిగింది. ముఖ్యంగా ఎక్కువ నష్ట పోయింది మోహన ప్రసాద్.

ఏమయితేనేం మోహనప్రసాద్ తెలుగులో 'Notorious Poet' అయ్యాడు. ఈ మాట అన్నందుకు కవిగారూ, ఆయన కవిత్వాభిమానులూ, శిష్యప్రశిష్యులు (ఎవరేనా ఉంటే ?) క్షమించాలి.

వేగుంట మోహన ప్రసాద్‌కి కవి అన్నవాడు తన మాతృభాషలోనే కవిత్వం రాయాలనేకచ్చితమైన అభిప్రాయం ఉంది ఆయన రాసినది అంతా తెలుగులోనే. తననితాను వ్యక్తీకరించుకునేందుకు మాతృభాషకన్నాఏదీ సరిగ్గా ఉపకరించదు. మాతృభాషలో కవి వ్యక్తీకరణలో ఒక 'ఈజ్'ని సాధించగలడు. ఇది పరభాషలో సాధ్యంకాదు. అయినా తనదికాని భాషలో కవి సహంజగామాట్లాడలేదన్న అంశాన్ని ఎరిగినవాడు కావటంచేత తనని వ్యక్తీకరించుకోవడానికి తెలుగును ఎన్నుకున్నాడు. అందుకు ఆయనకి దొరికింది 'తెలుగును వొదల్లేని అంగ్లం' అన్న బిరుదు.

గొప్ప కవులు భాషని సృష్టించుకుంటారు. మోహన ప్రసాద్ తనదీ అని గుర్తుపట్టదగిన 'కవిత్వపు భాష'ని సృష్టించాడు. తన భావోద్వేగాలను ప్రకటించడానికి వీలుగా భాషని మలచుకోగలిగిన శక్తి, భాషని కుదించ గలిగిన నేర్పు మోహన ప్రసాద్‌లో ఉన్నాయి. మోహన ప్రసాద్ తెలుగు కవిత్వానికొక 'సాంధ్య భాష'నిచ్చాడు. ఇది తెలుగికి ముప్పయ్ ఏళ్ళుగా మింగుడు పట్టం లేదు. అంత భావదారిద్ర్యం మనది. ఈ సాంధ్య భాషా ప్రవర్తకుడు 'వేదశ్లోకపుటాకసాన ఓంమ్మని. నోంమ్మనీ' అంటాడు. అక్కడ దుఃఖం చిందిపడుతుంది. ఈయనది గుండెలో నానబోసిన

శ్లోకాలు. వీటిని ఎండబెట్టాలి. వీటిల్లోంచి '౧' వత్తుల్ని జల్లించగా మిగిలిన ఏ శోకాలని వింటామో అవే ఈయన గీతాలు.

'కవిత్వానికి బాధ పర్యాయ పదం' అని చెప్పడం తప్పితే బాధల లోతుల్ని కొలిచిన 'తడిపాదాలు' తక్కువే. మోహన ప్రసాద్ 'పాదాలు' జీవన దుఃఖంలో కూరుకు పోయినవి లోలోతుల్లోంచి వస్తాయివి. తన జీవితాన్ని తనకే దూరంగా తీసుకుపోయి పడిన దిగులు. మోహన ప్రసా ది. ఈయన కవిత్వం చదూతున్నప్పుడు—దుఃఖించి కళ్ళుతుడుచుకుని మనవేపుకు ఎవరోవస్తున్నట్లుగానో లేదా మనలోంచి ఎవరో దుఃఖించ డానికి వెళుతున్నట్లుగానో అనిపిస్తుంది. అంటే చాలా సందర్భాల్లో ఈ కవి పడే బాధ మనది కూడా అవుతుందన్నమాట. కవిపడే Agony పట్ల మనకి రవ్వంతయినా సానుభూతి ఉన్నప్పుడు మాత్రమే ఇది సాధ్యం అవుతుంది. లేనప్పుడు కవి దుఃఖం అనవసరం అనిపిస్తుంది పఠితకు.

కలలోంచి కలలోకి మేల్కొన్న కలలా మోహన ప్రసాద్ కవిత్వం ఉంటుంది. ఎందుకు ఈయన కవిత కలయిందీ అంటే 'ప్రచండ వాస్తవ జీవనకిరణాల సూర్యుడు పొడిచే సూదులు పొడిచేస్తున్నప్పుడు ఆ బాధకి తట్టుకోలేక కలలోకి విరిగి పడతాడని చెప్పాలి. 'వ్రణాలపై వాలే వెన్నెల కిరణమై' మోహన ప్రసాద్ కవిత్వం.

ఆధునిక తెలుగు కవులలో 'Tragic view of life' ని సమగ్రంగా ప్రదర్శించ గలిగింది ఒక్క మోహన ప్రసాద్ అని చెప్పడం అతిశయోక్తి కాదు.

"జీవన దార్శనికోద్వేగాన్ని
అధివాస్తవికంగా రిఫ్లెక్టెడ్ సారోలో చెప్తానా నేను
అందులోనూ నిజం ఉన్నది"

అంటూనే 'నిజం నిజం కాదుగాని. అబద్ధం కానంతవరకునిజం' అన్న సందిగ్ధ తర్కాన్ని చూపుతాడు. కవిత్వంలో తనకో 'Sentimentalized Past' ఉంది. దానిని ఈ 'Vulgur presents'తో పోల్చినప్పుడు కలిగే వేదన 'మో' కవిత.

ఆధునిక మనిషి జీవితం ఎంత అసంబద్ధగా తయారైందో కవిగా మోహనప్రసాద్ గుర్తించాడు. 'Human Absurdity' ని 'మో' చిత్రిస్తున్నాడు. తనకవిత్వంలో ఎక్కడా సత్యాల గురించి, సౌందర్యాల గురించి, సామాజిక వాస్తవాలగురించిరాయలేదు ఆయనదొక 'Passionate anger against the

inequality of social conditions' వల్ల పుట్టిన అసంబద్ధకవిత, అనిబద్ధ కవిత. అసహజమైన వ్యవస్థలో బతుకుతున్న కవికి కలిగిన మానసిక పరివేదనలు, వాటి నీడలు ఆనీడల కదిలికతో మో కవిత్వంలో వయొలెంట్‌గా కనిపిస్తాయి. దీనినికొస్తా 'వైయక్తిక అరాచక వాదం'లా అనుకుంటారు.

వేదనల నీడలుగా కదిలే కవిత్వంలో 'మో' అన్వేషకుడిగా కనిపిస్తాడు. ఈయన కవిత్వమొక దుఃఖాన్వేషణ. ఇది గోపికాన్వేషణం కాదు. దేని గురించి వెతుకులాడుతున్నాడో తనకే తెలీని, అన్వేషించదగినదేదో ఉండే ఉండాలనీ, తాను వెతుకుతున్నాడు కనుకనే దొరకదగినదేదో ఉందనే ధోరణి 'మో'లోకనిపిస్తుంది. ఇందువల్ల ఈయన కవితల్లో 'apparent irrelevance and unrelatedness of things' మనకు ఎక్కువగా కనిపిస్తాయి.

తనకు కవిత్వ రహస్యాలు చెప్పిన వారిల్లో థామస్‌హార్డీ ఉన్నాడు. విమర్శకులు హార్డీని అంతంలేని నిరాశావాదిగా పేర్కొన్నారు. నిజానికి, తాను నిరాశావాదిని కాననే చెపుతూవచ్చాడు. హార్డీలో కనిపించే 'stoicism' 'మో'లో కొంచెంగానే కనిపిస్తుంది నాకు. 'stoicism' పట్ల మోకి ఉన్న అబ్సెషన్ హార్డీని దగ్గర చేసిందేమో. అయితే సంతోష దుఃఖాలకి అతీతంగా మోహనప్రసాద్‌లేడు. ఉండటానికి చేస్తున్న ప్రయత్నంలో విఫలమవుతున్నట్లుగా మనం గమనించగలం. మనిషి నిస్సహాయతకి కొలమానంగా కూడా ఈయన కవిత్వాన్ని చూడవలసి ఉంటుంది. మానవ వైఫల్యానికి సాక్షీభూతం ఈ కవిత్వం.

వాస్తవాన్ని, సత్యాన్ని, సౌందర్యాన్ని, నేరుగా ఆవిష్కరించక పోయినా తాను అన్వేషించే వాటిల్లో ఇవీ ఉన్నాయి. ఒక అంతిమ సత్యాన్ని వెతుకుతూ వెళ్తాడు'మో'. ఇదంతా ఆవేశకవనం కాదు. ఆలోచన ఒక దారిగా రూపాన్ని తీసుకోవటం మో కవితలో కనిపిస్తుంది. ఇదొక 'Process of thought' అని చెప్పాలి. ఈ 'thought process' మధ్యలో తెగి పోతుంది. ఈ తెగినకొస మరొక సంబంధంలేని ఆలోచనతో ముడిపడు తుంది. అక్కడ ఇబ్బంది పడతాడు 'మో'ని చదివే పాఠకుడు. అయితే 'మో'కి అలవాటుపడితే మాత్రం ఏ ఇబ్బందీ ఉండదు. కవిగా మోహన ప్రసాద్‌కి విషాదం దగ్గర విశ్రాంతి దొరకుతుంది. ఈ విషయం 'చితి–చింత', 'బతికిన క్షణాలు' 'రహస్తంత్రి' చదివినప్పుడు మనం గుర్తించ వచ్చు.

కవిత్వం అంటే సంకేతానికి సంకేతం అనేది మనంతెలుసుకోవలసి ఉంది. మోహన ప్రసాద్ 'కవిత్వం భాషయొక్క భాష' అంటాడు. ఏది ఏమయినా, హార్డీ ఏమిటి నేర్పా, ఇలియట్, జాన్‌డన్‌లు ఏమార్గాన్ని చూపారో క్షీణ దశాబ్దం (1890)లోని డౌసన్ ఏంచెప్పాడో మోహన ప్రసాద్ కవిత్వాన్ని క్షుణ్ణంగా పరిశీలించినప్పుడు తెలుసుకోగలం.

కవిత్వానికి సంబంధించి చాలా విలువైన అభిప్రాయాలను కవిత్వంద్వారా ప్రకటించాడు మో ఈ 30 ఏళ్ళలో. మరీ ఈ మధ్య "ఆధునిక కవిత్వం మెటనామిక్‌గా, మితోపోయిక్ (mythopoic)గా ప్రవర్తిల్లు తోంది" అని 'రహస్తంత్రి'లో ప్రకటించి కవిత్వచర్చకు ఆహ్వానాలు పంపుతున్నాడు. అంతే అయితే ఫరవాలేదు "శబ్దం భావం అర్థం అనుభవం. ఆధునిక కవిత ప్రయత్న పూర్వకంగానే అర్థాన్ని శబ్దాన్నీవిడదీస్తోంది" అంటూ శబ్దార్థాల గురించి భావం, అనుభవం గురించి చెప్పాడు. ఇవన్నీ మరో వందేళ్ళకు చర్చించుకుంటుంది, తెలుగుసాహిత్యం.

ఈ కవిని సర్రియలిస్టు అనేట్లయితే మార్సెల్ రేమాండ్ నో ఎ.టి. టోలీ నో సంప్రదించాలి. అసంబద్ధ కవి అనేట్లయితే మార్టిన్ ఎస్లిన్‌తో మాట్లాడాలి. అస్తిత్వవాది అందామా మనకి శ్రమ ఎక్కువ. అభివ్యక్తివాదం దగ్గరే పిన్ చేద్దామా అదీ కష్టమే. ముప్పయ్ఏళ్ళనుంచి లేంది ఇప్పు డొస్తుందా ? పోనీలే అదేదో De-Constructionist అందామంటే Post-structuralist perspectives మనకి తెలియవాయె ఇప్పుడు. జాకిస్ డెరిడాలను, బ్లూమ్‌లను, పాల్‌డిమాన్‌లను రోలండ్ బార్తెస్‌లను తెలుగు కవిత్వవిమర్శ ఎట్లా 'produce' చేయగలుగుతుంది? అవేవీ లేకుండా వేగుంట మోహన ప్రసాద్ ఎవరు ? ఏమిటి ? అని అడగొద్దు. మరిచి పోదాం ఈ కవి రెండు శతాబ్దాల తర్వాత దొరికితే 'అంత్రోపాలజిస్టులకి' అదృష్ట వంతుడు. దొరకకపోతే మరేం ఫర్వాలేదు. అంతవరకూ 'Pardonner-moi mon ignorance' అంటాను.

# ఉత్తమ కవితామూర్తి ఉత్పల

డా॥ తిరుమల శ్రీనివాసాచార్య

క్రీ. శ. పందొమ్మిదివందల ఇరవైఎనిమిదవసంవత్సరం జులైనెల నాల్గవతేదినాడు ఆంధ్రప్రదేశరాష్ట్ర కంభంమెట్టు మండలాంతర్గతమైన చింతకాని గ్రామంలో ఉదాత్త సంస్కృతసాహితికి ఉన్నత వేదిక అయిన ఉత్పలవంశంలో సంప్రదాయమర్యాదా మహితమైన వైష్ణవ కుటుంబంలో అలమేలమంగాగర్భశుక్తిముక్తాఫలంగా సత్త్వమూర్తులు శ్రీరఘునాథాచార్యుల తపఃఫలంగా ఉదయించి. తిరుపతిలో శ్రీవేంకటేశ్వరుని సన్నిధానంలో అక్షరాభ్యాసంతో పాటు ఉపనయనాన్నీ, విజ్ఞానార్జనతోపాటు వివాహాన్నీ గావించుకొని, విద్యాసనాథులై విద్వాన్, బి.ఓ.ఎల్., ఎం ఏ. డిగ్రీలను అగ్రగాములై సాధించి, గీర్వాణాంధ్రహిందీవంగభాషావిశారదులై, స్వాతంత్ర్యసమర యోధులై పత్రికారచయితలై సంపాదకులై బాలసాహిత్య నిర్మాతలై ఆదర్శాధ్యాపకులై ఉత్తమోపన్యాసకులై రసవత్కావ్యరచనా పారీణులై చలనచిత్రసరసగీతికా స్రష్టలై అనేక సాహితీ పురస్కార సంశోభితులై మనోహర కావ్యగాన సంతోషిత నిఖిలాంధ్ర సహృదయ కవిపండితమండలులై అనర్గళ సాహిత్యోపన్యాస కళాకోవిదులై ఆంధ్రదేశ ప్రభుత్వ విశ్వవిద్యాలయ ప్రచురిత సురుచిర పాఠ్యగ్రంథ సందోహులై సాహిత్య శాస్త్రనిష్ణాతులై వైదుష్య సంవాసిత వ్యాఖ్యాతృశిరోమణులై నవలాకారులై నాటకకారులై అనువాదకులై అసంఖ్యాక వ్యాసకర్తలై అఖిలాంధ్రదేశదిశాంచలాలదాకా తమ కీర్తిచంద్రికలను ప్రసరింపజేసిన కవిచంద్రులు శ్రీమాన్ ఉత్పల సత్యనారాయణాచార్యులుగారు.

స్వాతంత్ర్యోద్యమం సందర్భంగా ఉత్పలవారు 1942లో ఖమ్మంలో అరెస్టు అయినారు. మద్రాసునుండి వెలువడే 'మాతృభూమి' వారపత్రికకు 1946లో ఉపసంపాదకులుగానూ, తెనాలినుండి వెలువడే 'జైహింద్' వారపత్రికకు 1948లో సంపాదకులుగానూ పనిచేసినారు. సికిందరాబాదులో ముప్పైసంవత్సరాల పాటు అధ్యాపకులుగా ఉపన్యాసకులుగా ఉద్యోగంచేసి ప్రస్తుతం విశ్రాంతి తీసుకుంటున్నారు. వేటూరి, విశ్వనాథ, బాపిరాజు,

దేవులపల్లి, దివాకర్ల, గిడుగుసీతాపతి, శ్రీపాద, దాశరథి వంటి మనీషుల మహాకవుల సన్నిధిలో సాహచర్యంలో అనుభవం పండించుకున్న అదృష్ట వంతులు శ్రీ ఉత్పలవారు.

ప్రసన్న మధురంగా ధ్వనిబంధురంగా సాహితిని సృష్టించే ఉత్తమకవితా మూర్తులు ఉత్పలవారు. బాలసాహిత్యాన్నీ ప్రౌఢసాహిత్యాన్నీ గేయాన్నీ పద్యాన్నీ సమదర్శనంతో వర్షించిన సవ్యసాచులు. సంగీతమధురమైన మాత్రాచ్ఛందం బాలలోకాన్ని బాగుగా ఆకర్షిస్తుందనే మర్మంతెలిసిన ఉత్పల వారు బాల సాహిత్యసృష్టికి గేయాన్ని వాడుకున్నారు. అలా గేయంలో వెలి సినవే–గంగావతరణం, క్షీరసాగరమథనం, దాస్య విముక్తి, ఉత్పలమాల, దక్షయజ్ఞం, ఉత్పలిని, శమంతకమణి, పార్వతీకల్యాణం. కుమారసంభవం, చిన్నికృష్ణుడు, అర్జునుని తీర్థయాత్ర వంటి కృతులు చిన్నారి హృదయాలకు మధురపౌరాణిక కథా మంజరులను పరిచయంచేసే మంజుల కావ్యోద్యాన వాటికలివి. భారతీయ సంప్రదాయ పరిమళాలను అలతి అలతి పలుకుల్లో సంగీత మధురంగా అందించి తెలుగుజాతికీ భాషకూ మహోపకారం చేసినారు ఉత్పలగారు. వారు ప్రస్తుతం పంచతంత్రకథలను గేయమయంగా అందిస్తున్నారు. ప్రౌఢరసజ్ఞులకై ఉత్పలవారు సృష్టించిన అధునిక పద్య ప్రబంధాలు 'ఈ జంటనగరాలు హేమంతశిశిరాలు', 'స్వప్నాల దుప్పటి,' 'శతరూప'–అనేవి. ఇవి హాస్య శృంగార కరుణవీర రసోజ్జ్వలంగాసాగిన చంపువులు. ఇంకా శరణాగతి, తపతి అనేవి మొదటవెలిసిన ముగ్ధ పద్య కావ్యాలు.

ఉత్పలవారు 'ఆంధ్రభూమి' పత్రిక ద్వారా'ఆలోచనామృతం' 'వ్యాస పీఠం' అనే శీర్షికలలో శరపరంపరగా వ్యాసాలను అందించినారు. ప్రస్తుతం 'అంతర్దర్శనం' అనేపేరుతో మనీషుల జీవనరేఖలనూ అనుభవ తరం గాలనూ అందిస్తున్నారు. ఇవన్నీ సహృదయపాఠకుల ఆదరణను విశేషంగా అందుకున్నాయి. అందుకుంటున్నాయి. వీరి 'రాజమాత' పాండవమిత్ర కుంతి జీవితాన్ని సముజ్జ్వలంగా చిత్రించిన ఐతిహాసిక నవల. 'ఆంధ్రభూమి' ద్వారావరుసగా ప్రకటితమైన ఈనవల రసజ్ఞుల ప్రశంసలందుకున్నది. వీరి ప్రతిజ్ఞాయౌగంధరాయణము(నాటకం), కాదంబరీ సంగ్రహము, మందార మాల అనేవి సంస్కృతంనుంచి ఆంధ్రీకరణం పొందిన కృతులు. దేవ యాని, గాంధారి అనే కృతులు రవీంద్రుని కృతులకుఅనుకృతులు. అష్టదిగ్గజ కవులు, వ్యాసమంజూష, మనుచరిత్ర, బాలకథానిధి అనేవి వారి మరికొన్ని గ్రంథాలు. వీరి భామహకావ్యాలంకారము, శబ్దశక్తి, భట్టనాయకుడు—

మున్నగు రచనలు ముద్రణ కావలసివున్నాయి. ప్రభుత్వోన్నతపాఠశాలల కోసం, విశ్వవిద్యాలయ కళాశాలల అధ్యయనంకోసం ఉత్పలవారు అనేక పాఠ్యగ్రంథాలను నిర్మించినారు. మందారమాల, వ్యాసమంజూష ఆకోవకు చెందినవే. మధురగేయరచనావిశారదులైన ఉత్పలవారు—బొమ్మరిల్లు, విజయ, బొట్టూకాటుక, పట్నంవచ్చిన పతివ్రతలు వంటి చలనచిత్రాలకు గేయాలను కూడ రచించి అందించినారు.

ఉత్పలవారు పలికే పలుకులో ప్రతిభ పరిమళిస్తుంది. వ్రాసేవ్రాతలో పాండిత్యం ప్రకాశిస్తుంది. వారి కృషిలో ఋషిత్వం ప్రతిఫలిస్తుంది. వారి కావ్యధారలో తరతరాల సాహిత్య సంప్రదాయం తరగెత్తుతుంది. వారి రసస్ఫృష్టిలో భారతీయ సంస్కారం వేయిరేకులతో విరిసి కనిపిస్తుంది. వారి అభివ్యక్తిలో ఆధునికత అందంగా అలంకరించుకొని తియ్యగా రాగాలు తీస్తుంది. వారి హృదయం రసనిలయం. ఆ హృదయంతో దర్శించిన వర్ణించిన ప్రత్యంశమూ రసమయంగానే ఆవిష్కృతమవుతుంది. వారి కావ్యరచనకు ప్రేరణం కారణం ఈనాటి సమాజమే. నేటి సమాజంలోని సాధారణ ప్రజల వేదనలే, సమస్యలే, తరిగిపోతున్న భారతీయ ధర్మాలే అరిగిపోతున్న మానవతా మూల్యాలే ఉత్పల ఉల్లంలో కల్లోలాలను తీపి కావ్యాలను సృష్టంపచేసినాయి, చేస్తున్నాయి. వెర్రితలలువేస్తున్న ఆధునిక నాగరికతను నవ్వుతూనేనవ్విస్తూనే మందలిస్తారు. మెల్లగా బాధాతరంగాలపైనుంచి శ్రోతలను కరుణ రసం లోతుల్లోకి తీసికెళ్లి, ఆర్ద్రంగా కన్నీరు కురిపింపజేస్తారు. విశ్వ జనీనమైన విమలశృంగారాన్ని వ్యంజింపచేస్తూ సరసుల హృదయ వీణలను రమ్యంగా రవళింపజేస్తారు. ఈకవి నిత్యం జంటనగరాల్లో ప్రయాణించే ఒక సామాన్య ప్రయాణికుడు. వారి కాళ్లు నగరమంతా తిరుగు తాయి వారి కళ్లు నాగరికుల హృదయాల్లోకి దూసుకొనిపోతాయి. ఇందుకు ప్రత్యక్షర సాక్ష్యాలు 'ఈ జంట నగరాలు హేమంతశిశిరాలు' స్వప్నాల దుప్పటి అనే కావ్యాలు. హేమంతశిశిరాలు ప్రజలవేదనలకు ప్రతీకలు. ప్రజాసామాన్యానికి వసంతాగమనాన్ని ఆకాంక్షించిన కవితాకల్యాణ మూర్తులు ఉత్పలవారు. హాస్యరస ప్రధానాలైన ఈ కావ్యాలలోని ప్రతి పద్యం ప్రసన్నమధురం చమత్కారబంధురం, ఆది దంపతులైన నారీ పురుషుల కలయికను శృంగార రసాత్మకంగా చిత్రించే కావ్యం 'శతరూప'. ఈ కవి భారతీయ సంస్కృతి ప్రియత్వానికీ శాస్త్రవైదుష్యానికీ ప్రబంధ శైలీపారమ్యానికీ రసదర్పణం ఈ ప్రౌఢప్రబంధం.

ఉత్పలవారు కలం ఎత్తితే చాలు లలితమధురంగా పద్యం ప్రవహిస్తుంది. ఆ ధారలో భరతముని రసమాధుర్యం, భామహాదుల అలంకార సౌందర్యం, వామనుని రీతిప్రస్థానం, ఆనందవర్ధనుని ధ్వని వైభవం, కుంతకుని వక్రోక్తిశక్రచాపం, క్షేమేంద్రవిశ్వేశ్వరాదుల ఔచితీమర్యాదా చమత్కారచారుత్వం ప్రత్యక్షమై సాహితీవ్రతుల హృదయాలకు సంతర్పణ చేస్తాయి. ఉత్పలవారు గళం ఎత్తితే-ఆ మధుర పద్యగాన వైలక్షణ్యానికి శిరఃకంపం సేయని సహృదయు లుండరంటే అతిశయోక్తి కాదు. వారి కావ్యాలనుగూర్చి కృతిపతినోట పలికించిన "సంతృప్తవాణీ శిరఃకంప భ్రంశిత పారిజాత సుమముల్ కాబోలు" అనేమాటలు స్వభావోక్తులే. వారి కృతిని అలకిస్తే శ్రీ వేంకటేశ్వరస్వామి—"ఉరస్థ వజ్రకవచమ్ముల్ వ్రేల" నుప్పొంగిపోతాడన్నది అక్షరాలా సత్యం. కవితాశారద ఉత్పలవారి 'వదనాస్పద'.

రసాకృతులైన ఉత్పలవారికృతులు అనేక బహూకృతులకు పాత్రాలైనాయి. వారి—ఉత్పలమాల, గంగావతరణం, దాస్యవిముక్తి అనే కృతులు బాలసాహిత్యం అవార్డులను అందుకున్నాయి. 'ఈ జంట నగరాలు హేమంతశిశిరాలు' కావ్యం 1973లో ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ వారి ఉత్తమ కవిత్వ బహుమానాన్ని సంపాదించుకున్నది. 19 4లో 'శతరూప' కావ్యం మహాకవి గడియారం వేంకటశేషశాస్త్రి అవార్డును పొందింది. ఆంధ్ర ప్రదేశ ప్రభుత్వం 1981లో ఉత్పలవారికి ఉత్తమోపన్యాసకులని పురస్కారాన్ని అందించి సన్మానించింది. ఖమ్మంసభలో గొప్పసన్మానాన్ని అందుకున్నారు ఉత్పలవారు. వి. జయశ్రీగారు ఉత్పలవారి కృతులనుగూర్చి పరిశోధన చేసి హైదరాబాదు విశ్వవిద్యాలయం నుండి ఎం. ఫిల్. డిగ్రీని పొందారు.

ఉత్పలవారి కవితాశక్తిని సందర్శించిన మహాకవులు వారిని అనేక విధాలుగా ప్రశంసించినారు. కవిసమ్రాట్ విశ్వనాథ వారి చమత్కారమయమైన పద్యనిర్మాణ ప్రతిభను దర్శించి వారిని 'మహాకవి' అని ప్రశంసించినారు. మహాకవి దాశరథి—"ఉత్పలవారి భావనాబలం మహామహులచే శిరఃకంపంచేయిస్తుంది" అని మెచ్చుకున్నారు. కళాప్రపూర్ణ డా॥ బోయిభీమన్నగారు "ప్రబంధకవుల తరువాత ఇంతటి పద్యం వ్రాయగల కవి నాకింతవరకు కనిపించలేదు" అని యోగ్యతా పత్రం ఇచ్చినారు. పద్మశ్రీ ఆచార్య సి. నారాయణరెడ్డిగారు—"భావస్విన్నుడూ పరమ వ్యుత్పన్నుడూ" అని ఉత్పలవారిని శ్లాఘించినారు.

ఉత్పలవారు సౌజన్యమూర్తులు, నిరంతరాధ్యయనశీలురు, నిత్యహస న్ముఖులు, సాహితీతపస్వులు, నిరాడంబరులు, ఆశావాదులు, మానవతా భావభాసురులు, ఉత్తమగుణవినమ్రులు, చమత్కార సంభాషణ చతురులు ప్రాచీనా నిక సారస్వత సంపన్నులు, సుధామయమైన కవిత్వాన్నే స్నేహాన్నే పదిమందికి పంచియిచ్చే సౌహార్దజీవనులు, సామాజికస్పృహలో రచన సాగిస్తూ ఆధునికాంధ్ర కవిత్వాన్ని సుసంపన్నం చేస్తున్న రసజ్ఞశేఖ రులు, శారదాసమారాధకులు.

ఉత్పలవారి మహనీయ కవిత్వవ్యక్తిత్వ చిత్రణను వారిని ప్రశంసిస్తూ వ్రాసిన నా రుబాయితో ముగిస్తాను.

"తరతరాల తెలుగు పద్యశిల్పానివి
వాగ్దేవీ మృదులోత్పలతల్పానివి
హృదయవీణలను మీటే ఉత్పలా !
కావ్యకల్పనాప్రతిభా కల్పానివి !"

# చల్లారామఫణి

## యుద్ధాన్ని కౌగిలించుకో !

ఒంటరితనం సహస్ర ముఖాలతో సవాలు చేసే
ఒళ్లంతా కళ్లున్న రాక్షసి !
నాలుగు వైపులా పళ్లున్న పదునైన కత్తి !
చుట్టమై వచ్చి దయ్యమై పట్టుకుంటుంది !
కోటిమంది మధ్య ఫుట్‌బాల్ గ్రౌండు దొమ్మీలో నలిగినట్లు నలిగిపోతున్నా
కోడిలా కూసి, బుసలు కొట్టి ప్రశాంత మానస సరోవరంలో
కాళిందిలా విషం విమ్ముతుంది !
నీతో నువ్వు మాట్లాడుకోవడం ఆత్మవిమర్శ అయితే
నీలో నువ్వు మాట్లాడుకోవడం ఒంటరితనం పంచే పిచ్చి !
దయ్యం పడితే భూతవైద్యుడికి అప్పగించాలని
పిచ్చిపడితే పిచ్చాసుపత్రిలో తోసేయాలని ఎవరికైనా తెలుస్తుంది !
ఈత తెలిసినా ఒంటరితనం సముద్రంలో మునిగిపోయేవాడికి
జలస్తంభన విద్య నేర్పాలనుకోవడం దేవతావస్త్రాలకోసం డబ్బుదాచడం !

తామరాకు మీద నీటిబొట్టు ఒంటరి !
లక్ష నక్షత్రాల మధ్య నలుగుతున్నా మచ్చతప్ప మరో తోడులేని
చందమామ ఒంటరి !
గ్రహాల్ని తాకకుండా తన చుట్టూ తాను తిరిగే భూగోళం ఒంటరి !
మనసులేని మనువాడిన మగువ ఒంటరితనమే తోడై జీవించే వ్యర్థాంగి !
నిశ్శబ్ద నిశీధిలో నిరాశల చప్పుళ్లు వింటూ
నువ్విచ్చే రూపాయికోసం శబ్దం చేస్తూ
శూన్యంలోకి 'పారాహుషార్' అని అరిచేవాడు ఒంటరి !

ఒంటరితనం నీ కలల బ్యాంకు !
ఒంటరితనం సముద్రం నీ ఆలోచనల నిధులు దాచుకోడానికి
దొరికిన కన్నీళ్ల ట్యాంకు !

పుట్టుకతో పుట్టే ఒంటరితనానికి చావుతోనే రావాలి చావు !
ఒంటరితనపు సముద్రపు సుళ్లు
నీ గుండెలో రంపపు మిల్లు !
ఒంటరితనం నీ మనసనే విశ్వామిత్రుడి సృష్టి !
సమిష్టి దృష్టి నీ హృదయానికిస్తుంది పుష్టి !
ఒంటరితనం భూతం చేతిలో ఓడిపోవడమంటే జీవిస్తూ చచ్చిపోవడం !
చచ్చిపోతూ జీవించడం
ఒంటరితనాన్ని ఓడించలేనినాడు
మృత్యువుతోనే 'చెస్' ఆడి
ఒంటరితనాన్ని ఒంటరిని చెయ్యి !
ఒంటరితనాన్ని ఆహ్వానించడమంటే
యుద్ధాన్ని కౌగిలించుకోవడం !
యుద్ధాన్ని కౌగిలించుకోవడమంటే
జీవితాన్ని జీవంతో జీవించడం !
ఒంటరితనానికి శ్రాద్ధం పెట్టి
యుద్ధాన్ని కౌగిలించుకో ! !

• • •

"కవిత
కాలానికి ముందుమాడ
లోకందాని గీటురాయి
ఆత్మలోతుల ఆఖరి వెలుగు కవిత
నిర్వచనం నింపలేని నిశ్శబ్దం కవిత

—అరిపిరాల విశ్వం

# అడిగోపుల వెంకటరత్నమ్

## అసమర్థుని ఆరోప్రాణం

సమర్థుడి పడగకింద పండుకొన్న వాడివి
అసమర్థత ఒంటికి కప్పుకొన్న వాడివి
నువ్వు సమర్థుడవైన అసమర్థుడివి !
అసమర్థత ఆత్మహత్యకు అంకితం
అది
అగరువత్తయి ఆత్మాహుతి చేసుకొంటుంది
కర్పూరమై నైరూపిగా మార్చుకొంటుంది
వ్యతిరేకతే ఎదుటివాడి ప్రయోగమైనప్పుడు
ఎన్ని శ్వేతపత్రాలు ప్రకటించినా ప్రయోజనం వుండదు
సాహసం జీవితాన్ని మోసుకొంటూ సాగితే
సమర్థతమేనాలో స్వాగతం పలుకుతుంది !
పురివిప్పి ఆడే నెమలి నృత్యం వెనుక
పడిలేచిన అనుభవాల అభ్యాసం వుంది
భీకరారణ్యాన బ్రతికే లేడి బెదురు కళ్ళవెనుక
క్రూరమృగాల నిత్య వేధింపు వుంది
సముద్రానికి ఆ హంగూ పొంగూ
నదులు యిచ్చిన నిర్వాకమే !
కన్నీళ్ళతో సేద్యం చేస్తున్న వాడు
నీ సుఖాన్ని ఎన్నడూ కోరని వాడు
భయంతో భూమి మీద నడుస్తున్నప్పుడు
నీ భావాలకు తగిలిన ప్రకంపనాల్ని
నువ్వు బొత్తిగా గమనించడం లేదు !
అసమర్థుని మరణం అడుగడుగున
సమర్థుని మరణం చిట్టచివరన
అసమర్థత సమర్థుడు కప్పిందేగాని
నీకై నువ్వు తొడుక్కున్నది కాదు !
అసమర్థుడికి భయం ఆరోప్రాణం
అది పంచప్రాణాలపై స్వారీ చేస్తున్న మరోప్రాణం !

# దేవరాజు మహారాజు

## రేప్ చేయబడ్డ నగరం గూర్చి

నగరం, కర్ఫ్యూలో కాల్చిన మాంసం సీకు
నగరం, వెన్నుపోటు పొడిచే మిత్రుడి బాకు
నగరం, అనుమానాల పుట్ట–మానవ కళేబరాల గుట్ట
ఇక్కడ తరతమ భేదాలు లేవు
మత పట్టింపులు రావు కులప్రసక్తి లేదు
రాజకీయమొక వ్యూహం
ఎవరు ఎప్పుడు ఎక్కడ
బల్లినోట్లో ఈగవుతారో తెలియదు

సామాన్యుడిక్కడ బలౌతాడు కానీ
అయోధ్య రాముడికేం?–బతికొస్తాడు
సంప్రదాయం సంరక్షింప బడుతుంది
సత్శీలం మాత్రం భక్షింపబడుతుంది
దేవతలారా మీరంతా ఎక్కడ?
ఆకాశమార్గాన పయనిస్తున్నారా?
పూల వర్షాలు కురిపించండి
ఈ భూమి-ధర్మభూమి, 'ఖర్మ' భూమి

ఖడ్గాల పెదాల మీద నవ్వులు వికసిస్తున్నాయి
కత్తిపోట్లతో సమైక్యత నిలబడుతున్నది
దొంగ లెవరు దొంగలెవరని
దొంగలే ప్రశ్నిస్తున్నారు
గుడ్లన్నీ పాములు తిని పోతున్నాయి
చిన్నారుల తలలు వేటగాళ్ళకు
హారతవుతున్నాయి హారమవుతున్నాయి
రక్త సముద్రపు చెలియలి కట్ట తెగింది

కాళ్ళూ చేతులూ కొట్టు కొస్తున్నాయ్
కుళ్ళిన మానవత్వం వాసన
భరింప రాకుండా ఉంది
గాలి బెదిరి పోయింది
భూమే అదిరిపోయింది
ఈ రోడ్ల వెంట చెట్లన్నీ
అశోకుడు నాటించినవే
ఈ దారిన బావులన్నీ బాబర్ కాలం నాటివే...
అయితేనేం, నగరం అసహ్యమై నగ్నమౌతున్నది
నగరం దగ్ధమై కుళ్ళుకుంటున్నది

ఇప్పుడిక,
రేప్ చేయబడ్డ
నగరం గూర్చికాదు మనబాధ
పుట్టబోయే విష శిశువు గూర్చి....?

(1990 నవంబర్–డిసెంబర్‌లలో హైదరాబాద్ పరిస్థితులకు స్పందించి)

• • •

ఉండాలోయ్ కవితావేశం
కానీవోయ్ రస నిర్దేశం
దొరకదటోయ్ శోభాలేశం"

—శ్రీశ్రీ

## మహర్షి

### నిరుద్యోగి ఆత్మకథ

ఎయిర్ కండిషనర్ డబ్బు గోడలమధ్య
నీ ప్రతిభకు కట్టిన విలువ
వలువలు విప్పుకుంటుంది
ఆఖరి క్వశ్చన్ మార్కు ముందు
"లంచం" ప్రశ్నలు నిలదోస్తున్నపుడు
జవాబు లేని నీ మేధాశక్తి తలొంచుకుంటుంది
నువ్వు కట్టుకున్న ఆశల గాలిమేడలు
అప్పుడు కూలిన పేకముక్కలవుతాయి
నీ పేదరికాన్ని బయటకి తోస్తూ
పచ్చనోట్ల పాదాలకు స్వాగతం పలుకుతుందాగది
నీ వెనుకే మూసుకు పోయిన స్ప్రింగ్‌డోర్ మధ్య
నలిగిన నీ ప్రతిభ తాత్కాలిక సమాధి అవుతుంది
కాలం నీ కంట్లో కరిగిపోయిన
కన్నీరవుతుంది.
ఆశయాల గంజి త్రాగుతూ సిద్ధాంతాల గాలిపీల్చి
బ్రతుకు భారమవుతుంది.
నవ్వప్పుడు
అమ్మ మెడలో బంగారు బంధాన్ని తెగనమ్మి
ఆశల పసుపుతాడు వేసి ఆమెను ఓదార్చుతావు
అందమైన ఆత్మవంచన రేటుపెట్టి
స్వార్థం మార్కెట్టులో ఒక ఉద్యోగాన్ని కొనుక్కుంటావు...

* * *

దేశం సు 'భిక్షం' గానే వుంటుంది
కన్నీటి నదులై
నిరుద్యోగ జీవితాలు ప్రవహిస్తూనేవుంటాయ్...

# హరిచంద్రశేఖర్

## ట్రంకుపెట్టె కన్నీళ్ళెట్టుకుంది

కుండ పగల గొట్టిన భయంతో
మూల నక్కిన పసివాడి ముఖంలా ఉన్న
ఆ గదిలో అడుగిడగానే
అలనాడు పెళ్ళి పీరెలు పదిలంగా తెచ్చుకున్న
ఆమె ట్రంకుపెట్టె
నన్ను చూసి కన్నీళ్ళెట్టుకుంది.
మూగబోయిన నా బ్రతుకును తనలో దాచి
జీవితమంత గోతిలో పూడ్చేసుకోడానికి
తను మిగిలేనని
కన్నీటి ధారల సంకేతాలిచ్చింది.
ఇంటినిండా కదులుతున్న
సానుభూతి ఎండమావుల
చెవుల జతలు వినలేని వేదన
తన దొరసాని విడచిన గాలివీణ
పల్లవించే మంటల పొత్తంలా
తనలో దాచి పదిల పరుస్తానంది
తోడులేని ఆకాశాన్నై
దూకుదామనుకున్న భావిలో
నీది అడుగు చందమామ
పిచ్చివాడవని గేలి చేసింది
పగబట్టి బ్రతుకు పలుకాడనపుడు
అడివిలోని పిచ్చిగాలిని కౌగిలించుకున్నా
ఒంటరితనపు నిద్రమాత్రలు మింగి
వూరి బయట చెట్టుకొమ్మకు వేలాడుతున్నా
అర్తి అజ్యమై ఎదకాలుతుంటే
ఆగ్రహించి శపించి మంత్రజలం చల్లితే

గోడలకున్న పటాలు పగిలినయ్
గదిలో పట్టెమంచం విరిగింది
ప్రేక్షకుల్లా కూర్చున్న పుస్తకాల గాలిపుటలు
మతిచెడి నా చుట్టూ గెంత సాగాయ్
ఆమె ట్రంకు పెట్టె మాత్రం
కన్నీళ్ళెట్టుకుంటోంది

* * *

"ప్రవాహంలా ఉంటుంది మహాకావ్యం
ప్రభావంలో పడేసుకుంటుంది మహాకావ్యం
తనవైపు ఆలోచనల్ని లాక్కొనే సూదంటురాయి
సాఫుజేసి హృదయాలని నిగనిగలాడింజే ఆకురాయి"

—ఆరుద్ర

## కె. సీతారామగిరి

### మృత్యువు

మొన్నెప్పుడో
రాజమహేంద్రవరంలో
మిట్టమధ్యాహ్నం
నడిరోడ్డుమీద
కూజించే ఓ కవికోకిల
కలలు కనే పసి పాపలా
కలత నిదురలో
కనిపించని తీరాలకు
సాగిపోయిందట.
కర్మసాక్షీ !
నువ్వే సాక్షివట.
ఓ యువ కవి
అభినవ రవి
తనదైన ఓ బాణీతో
తలెత్తుకుని తిరిగే తరుణంలో
రెక్కలు తెగిన పక్షిలాగ
నేల కూలిన ఉదంతం
నీకు తెలుసు.
మృత్యువు ఫలహారానికి
ఓ మర్త్యుడు బలయిపోయేడు.
ఓ దేవుడా !
నువ్వేదో చావుదెబ్బ కొట్టేవని
మురిసిపోకు.
నీ అస్తిత్వం చాటేది
ఈ మానవుడే అని మరచిపోకు.
నువ్వు మరణించేడనుకుంటున్నవాడు
ఇంకా జీవించే ఉన్నాడు

కథల్లోనూ కవిత్వంలోనూ
కావలసిన వాళ్ల హృదయ కవాటాల్లోనూ.
నీకు తెలుసు
మనిషికి మరణం తప్పదని
కానీ నీకు తెలీదు
కవికి మరణం లేదని.
(కీ.శే. గోదావరిశర్మగారి స్మృతికి)

o o o

''నేను పాటను
అసత్యం కల్తీలేని బంగారం మూటను
రైతులతో పొలందున్నే చల్దిమూటను
బెదిరింపుల ఫిరంగులకు
బెక్కు బెదరని ఉక్కుకోటను
రచనల పూలతోటలో
ఛందస్సు మొక్కలు నాటను
భావనలో సామాన్యుని
జీవితం వలయాలు దాటను''

—కుందుర్తి

భద్రాచలం శశితేజ్

## పాట ఆగిపోతే !

నేను వెళ్ళిన ప్రతిచోటకి
నీపాట నన్నంటే వస్తోంది—
మరిగి ఆవిరై ఏ మేఘంలోనో చిక్కుకున్నాయనుకున్న
గాయాలు మళ్ళీ తీయగా మొలకెత్తుతున్నాయి—
మలి సంజె కెంజాయ సమయం
ఏదో ఆలోచించుకుంటూ ప్రవహిస్తోందినదికూడా
ఒడ్డునున్న నాలాగే !
వెనకటి అలల చప్పుడు
వాటిపై వాలే సుగంధపు స్మృతులు
ఎప్పుడూ గూటిలోనే వుంటాయి ఎగరలేని పక్షుల్లా—
ఒకవేళ ఎగిరితే ఇంకేముందీ
నన్నంటి వచ్చేపాట రెండుగా విరిగిపోతుంది
గాయాలు బీడుపడి
బహుశా ఏమేఘం కోసమూ ఎదురుచూడవు

* * *

"నా అక్షరాలు కన్నీటి జడులలో తడిసే దయాపారావతాలు
నా అక్షరాలు ప్రజాశక్తుల వహించే విజయ ఐరావతాలు
నా అక్షరాలు వెన్నెలలో ఆడుకునే అందమైన ఆడపిల్లలు

—బాలగంగాధర తిలక్

## ఎండ్లూరి సుధాకర్

### వసంత స్పర్శ

రాత్రానుస్పర్శ ఎండిపోతూంది
ఒక పచ్చని నవ్వు
ఒక నిష్కపట ఆలింగనం
ఒక నిర్మల కరచాలనం
ఏమీ లేకుండా గొంగళి పురుగులమైపోతున్నాం
దయకూ కన్నీటి లయకూ
ఇక్కడ ఆతిథ్యం లేదు
రూపాయి కటకటాల వెనక
వెల్లని నాణాల దిగులు ముఖాలం
వ్యాపారం గూళ్ళల్లో
డబ్బు పిట్టల కువకువలం
కాలం భల్లూకమై అడుగడుగునా
కలల గొంతు నులిమేస్తున్న సన్నివేశం
బ్రతుకు తీగలకు నమ్మకం ద్రాక్షలు కాయడంలేదు
మనుషులంతా గుంపులు గుంపులు గా
క బేళాల్లోకి తరలిపోతున్న హత్యా దృశ్యం
చౌరస్తా సమాధి పెట్టెలో
శవాకార నిరాహార శిబిరం దండలు వాడిపోయి
పూలు రోడ్లమీద ఊరేగుతున్నాయి
మనం శవాల టేబుళ్ళ మీద కూడా
విందు భోజనం చెయ్యగలం
మనం నిర్దయగా
పాడెల మీద వాహనాలు నడుపుకుంటూ పోగలం
స్పర్శకొడిగట్టింది
మనిషి చెట్టుకు కన్నీరు కరువయ్యింది
ఇప్పుడు మానవ రుతువు మీద ఒక నిత్య వసంత స్పర్శ
హరిత చర్మాన్ని తొడుక్కోవలసిన అవసరం...

# జింబో

## నగరం రావి చెట్టుకి....

మూడు బియ్యం బస్తాల రిక్షాని
చడావు మీదికి తొక్కినంత కష్టంగా
నాలుగంతస్తులు ఎక్కిన తరువాత
స్కూటర్‌లో మర్చిపోయిన గదితాళం చెవులు
తీసుకరావల్సినంత బాధగా
పరీక్ష ఫెయిలై ఇంట్లో కాలు పెడ్తున్న
పదోతరగతి బెరుకుతనంగా
మనం ఇక్కడికొస్తాం

పల్లెల్లో మన భూముల పాదాల కొచ్చిన పగుళ్ళో
ఎండిపోయి వక్కిపోయిన 'మోసంబీ'ల్లాంటి మన బావులో
మన బతకొచ్చినతనమో
మన నౌఖరీల బదిలీల జులుబో
ఏదో,
చచ్చిన కుక్కని మున్సిపల్ లారిలో లాక్కెళ్ళి వేసినట్టు
మనల్ని ఇక్కడికి

ఇక్కడ లేని ఉదయాల్ని
రాని సాయంత్రాల్ని
ప్లాస్టిక్ చెట్లమధ్య, ప్లాస్టిక్ కాయల మధ్య
సృష్టించుకుంటాం
పక్షుల కిలకిలారావాలు తునాతునకలైపోతుంటే
టీవీ ముందు ప్రేక్షకుల్లా చూస్తూ వుంటాం
ఈ ప్లాస్టిక్ కాయల మధ్య
శశాంకుడు ఆత్మహత్య చేసుకోవడం
మన దృష్టిలోకి రానేరాదు

మెల్లిమెల్లిగా ఈ నగరం తన బాహువుల్ని చాపి
మనల్ని తన రొమ్ముకి అదుముకుంటుంది
పరవశులమవుతున్న మనకి
అది ధృతరాష్ట్రుని కౌగిలని తెలియదు
ఈ నగరం మత్తుమందు
మెల్లిమెల్లిగా ఇరానీ చాయలా
మన నరాల్ని లాగుతూనే వుంటుంది

అధికారం మత్తులాగే
ఈ నగరం మత్తుకి మనం బానిసలవు తాం
ఇక
ఈ నగరం రావి చెట్టుకి
గబ్బిలాల్లాగా వ్రేలాడుతుంటాం

* * *

"తిమిరంతో ఘన సమరం
జరిపిన బ్రతుకే అమరం
కవితా తేజోవలయం
అవని శాంతికది నిలయం"
—దాశరథి

# తంగిరాల సుబ్బారావు

## నెత్తిమీద కత్తుల పంకా

నానెత్తిమీద నిత్యం తిరిగే కత్తులపంకా !
కాలంత్రినేత్రుడు
మూసినకన్ను భూతం
తెరిచినకన్ను వర్తమానం
ఎప్పుడు తెరుచుకుంటుందో తెలియని మూడవకన్ను
భావి !

నాకు
మా తాత తెలుసు
మా మనవడు తెలుసు
కాని
మా తాత తాత తెలియదు
మా మనవడి మనవడూ తెలియదు.
అంతమాత్రంచేత
ఈ చెట్టుకు వేళ్లులేవంటే ఎలా ? విత్తే లేదంటే ఎలా ?
ఈ కొమ్మకు కొత్తచిగుళ్లు పుట్టవంటే ఎలా ?
చెట్టుమీదపండు—పండులోబీజం—బీజంలోమళ్లీచెట్టు—
మళ్లీపండు—

గిరగిర గిరగిర తిరిగేకాలచక్రం !
యుగంలోంచి యుగం
ద్వాపరంలోంచి కలి !
నా కుత్తుకమీద కత్తుల చక్రం ! !

నాటి భారతంలో—
చీకటి వెలుగుల పోరాటం

ఘర్షణలూ సంఘర్షణలూ బాహాటం
ధర్మ సంస్థాపన కోసం పూరించిన పాంచజన్యం
సారించిన గాండీవం !
మంటలు మంటలు
మసి రాసుల మసిపాటలు
బూడిదలోంచి ఫీనిక్స్
సమాధిమీద గడ్డిపువ్వునవ్వు
అస్త్రదగ్ధకేదారంలో నవీనాంకురం పరీక్షిత్తు !
మహాప్రస్థానంతో ఆశోపహతులైన ప్రజలకు
ఒక లేత అభయహస్తం ఇచ్చిన భవిష్యత్తు !!

నేటి భారతంలో—
అంతా అయోమయం, తమోమయం.
మబ్బుచాటున మేఘనాథుడు
కన్నుపొడుచుకున్నా కానరాడు !
'ఏకం అసత్, మేచ్ఛాబహుధావదంతి'
కంస, జరాసంధ, శిశుపాల, దంతవక్త్ర,
దుశ్శాసన, సైంధవ, బకాసుర, కీచకులందరూ ఇప్పుడు
ప్రజాస్వామ్య కామరూపవిద్యలో
ఆరితేరినపౌండ్రక వాసుదేవులే !
ఓట్ల బ్యాంకులు నింపుకోవటంలో
ఒక్క వేలిముద్రేళ్లను కులమతాలకత్తులతోచీల్చి
దండలుగామెడలో ధరించిన అంగుళిమాలులే !
కులంతో ధనంతో విద్యాఉద్యోగప్రతిభల కొనుగోలు
కట్నాల పెట్రోలు బావిదగ్గర నూతన వ  వుల అగ్నిస్నానాలు
హింసావర్షాలు కుండపోతనా కురిసి
దేశమంతటా ముంచెత్తుకున్న హత్యల వరదలు !
మొసళ్లున్నస్నానఘట్టాల్లో అమాయకుల పుష్కరస్నానాలు !!

ధర్మక్షేత్రం ఆ కురుక్షేత్రం
అధర్మక్షేత్రం ఈ కులక్షేత్రం

దేశమంతా జరాసంధుడి జైలు !
కృష్ణుడులేడు, అర్జునుడులేడు, భీముడసలే లేడు !
తెలివి మీరిన నవీనకంసుడు చేయించేశాడు
వసుదేవుడికి వ్యాసెక్టమీ, దేవకికి ట్యూబెక్టమీ !
ఈ జైల్లో ఇక కృష్ణుడు పుట్టేఆశ లేదు !
కుంతీదేవికి బ్రెయిన్‌వాష్ చేస్తే
మంత్రం మరిచిపోయింది
ఏ అడవిలోను ఇక పాండుపులు పుట్టరు ;
గాంధారి కొడుకులే మన గండర గండలు !
కలియుగాన్ని ఉద్ధరిస్తాడనుకున్న 'కల్కి'
తన గుర్రాన్ని వైట్ హౌస్ టాంగాకి, అద్దెకిచ్చి,
తుప్పుపట్టిన ఎర్రకత్తి పారవేసి,
గొంగడి బుజానవేసికొని,
డొక్కుసైకి లెక్కి,
ఫ్యాక్టరీకి పోతున్నాడు !

నాటి భారతానికి మూలం పాంచాలి
నేటి భారతానికి కూడా మూలం
అమహాతల్లి పుట్టిల్లే !
మేన మామలు ఎం.పి.లై
శీతకాలం పార్లమెంటులో
శాంతికోసం చేస్తున్నారు తీర్మానాలు;
ఆశ బావని నాపిచ్చిప్రజలకు
లేనిపోని అనుమానాలు !!

## జి. రెజీన

### ప్రార్థన

ఉద్యోగం గానుగెద్దు తిరుగుడు
అధికారుల ముళ్ల చూపుల సణుగుడు
విద్యార్థుల విచ్చిన ముఖకమలాల చెన్నులు
నెలాఖరు జీతపురాళ్లకోసం ఎదురుతెన్నులు—
భరించాలంటే
సహించాలంటే
ఆనందించాలంటే
చూచి చూచి కన్నులు కాయలు కాయాలంటే—
ఓ భగవంతుడా !
నాకొంచెం ఆరోగ్యమివ్వు !

కన్నపిల్లల ఆకలి కడుపులు
మొగుడికి అడుగడుక్కి ఒత్తవలసిన మడుగులు
ఇంటిల్లపాది అవసరాల తామర తంపర
బంధుమిత్రుల రాక పోకల పరంపర
రుజాగ్రస్త జననీ జనకుల జరావస్థ—
అన్నీతట్టుకోవాలంటే
ఓ భగవంతుడా !
నాకొంచెం ఓపికనివ్వు !

సాహిత్యసుధాసాగరపులోతులు
సంగీతనాదబ్రహ్మం క్రమ్మిన ఆకాశపుటంచులు
చిత్రవిచిత్రవర్ణరంజిత దివ్యవసుంధర
చెట్లకొమ్మల రాపిడి పుక్కిలించే కార్చిచ్చు
దిక్కుల్లోదాక్కున్న తుఫానుగాలి
పంచభూతాల కౌగిట్లో బంధింపబడ్డ మానవ సంస్కృతి
అణుబాంబుల పొగలో ఉక్కిరి బిక్కిరవుతున్న నాగరకత

స్వార్థం రక్త పుటేర్లు
యుద్ధాలు శాంతికి కట్టేస మాధుల బొర్లు
రెప్పపాటు జీవితంలో కష్టాల తిప్పలు
మొగాడు తల్లితో చెల్లితో చూడలేని సినీమాల చీకటితప్పులు
గడియారం ముళ్ల కౌగిట్లో
ఉదయాస్తమయాల దాగుడుమూతల్లో
చిగురుతున్న కాలెండర్ కాగితాల్లో
నెరిసిన తల వెంట్రుకల్లో
చర్మం ముడతల్లో
కను చూపుల క్యాటరాక్టు మక్కల్లో
పరుగులు పెడుతున్న జీవననదిలో
వ్రేళ్లసందులనుండి జారిపోతున్న కాలం
వేయి విధాలుగా పారిపోతున్న కాలం
ప్రాణికోటిని మృత్యుగహ్వరంవైపు తరుముతున్నకాలం
పరమేశ్వరా ! ఇదంతా నీ యింద్రజాలం !
దీని అద్భుతాన్ని ఆస్వాదించాలంటే
దయచేసి నాకొంచెం అయుర్దాయమివ్వు !!

## మధుసూదనరావు

### చీకటిచిత్రం

చీకటి కవిత్వం కాకపోవచ్చు!
కన్నీళ్ళను ప్రేమించేవాడు
బాధరుచి తెలిసినవాడు
నిలువెత్తు విషాదంతో నిలిచిన
ప్రతి ఒక్కడూ—
కవిత్వాన్ని చీకటితోనే అంచనావేస్తాడు!
చీకటి అంటే—వెలుగును దగ్ధంచేసి
నెత్తురోడుతున్నవేళ వినదిస్తున్న గజల్!
చీకటి అంటే—లోహసంకల్పంతో
మ్యాగజీను నింపుతున్న సమూహం!
చీకటి అం —హైదరాబాదు చెక్కిలిపై
సలసలా జారే కన్నీరు!
చీకటి అంటే—దక్షిణాఫ్రికా ముఖచిత్రానికి
నిలువెత్తు దర్పణం!
నాగలినడక మెలికపడ్డా
మేధస్సుగని 'కొలాప్స్' అయినా
చీకటిమాత్రమే ప్రత్యక్షసాక్షియై పరివ్యాప్తమౌతుంది
సవాలక్ష వైరుధ్యాలమధ్య
కొన ఊపిరి వెలుగుకు ప్రాణంపోస్తూ
విన్నటి గాధలకూ, నేటిజ్ఞాపకాలకూ
రేపటి అనుభూతులకూ సాక్ష్యమై
నిశ్శబ్దంగా నిష్క్రమిస్తుంది!
దేహపు శూన్య శిఖరమ్మీద
చీకటి—ఆశల రేపటికి
రెక్కలు తొడక్కున్న
అక్షరమై వెలుగుతుంది!!

•

# దర్భశయనం శ్రీనివాసాచార్య

## ఎప్పుడూ...

ఎప్పుడూ ఏదో ఒక పోయెం
ముందుండి దారి తీస్తూనో
వెనకాల నుంచి వెంబడిస్తూనో
కుడియెడమల రెక్కలల్లారుస్తూనో
గుండె గుడారంలో సుళ్ళు తిరుగుతూనో
కంటి కర్మాగారంలో రూపు దిద్దుకుంటూనో
ఎప్పుడూ ఏదో ఒక పోయెం

తీగ సాగినట్లుగానో తుఫాను రేగినట్లుగానో
తూర్పు గొంతు విచ్చుకున్నట్లుగానో
మౌన పవనం మీద వాలినట్లుగానో
శబ్దఫిరంగి మనసువాకిట్లో పేలినట్లుగానో
ఎప్పుడూ ఏదో ఒక పోయెం

పూలసారమై స్పర్శిస్తూనో
పున్నమి వెన్నెల కిరణమై వర్శిస్తూనో
ఒక కొత్త మానవుడి స్వచ్ఛగాత్రమై పరమర్శిస్తూనో
ఏకాంతవాటికలోకి మునివేళ్ళ మీద నడిచివస్తూనో
నాలుగు రోడ్ల కూడలి చిత్రాల్ని ఒకటొక్కటిగా ఒంపుతూనో
ఎప్పుడూ ఏదో ఒక పోయెం

కళ్ళు బరువెక్కినపుడూ
నడిచేదారి మసక బారినపుడూ
బాధ వేయి ముఖాల్తో శపించినపుడూ
మానినట్లైన గాయం మళ్ళీ పెట్రేగినపుడూ
చీలుతున్న దేహం ఆత్మీయస్పర్శలో ఒకింత సేదదీరినపుడూ
హృదయం పోయెం అవుతుంది కదా!

నా బ్రతుకు మైదానంలో దూరం పేరు పోయెం !
నా బ్రతుకు గడియారంలో కాలం పేరు పోయెం

# సంయుక్త కవిత

అఫ్సర్ ఆర్వీయస్.సుందరం
ఎండ్లూరి సుధాకర్ యాకూబ్
సీతారాం

## పాతబస్తీ

నేను నడిచిన రోడ్లేనా ఇవి
నన్ను పలకరించిన వీధులేనా ఇవి
ఇప్పుడు కాళ్ళకింద మడత కత్తులై తగులుతున్నాయ్
కడుపులో నెత్తుటి తుఫానై
మానవ తీరాలమీద వాల్తున్నాయ్
నేను బతికిన ఇళ్ళేనా ఇవి
తలుపులు తెరిచిన స్మశానాలయ్యాయి
నేను పీల్చిన గాలేనా ఇది
తూటాల తుపాకుల కవాతుని మోస్తోంది
అసలే మూసుకుపోయిన రోడ్లమీద
రెక్కలు ముడుచుకుంటున్న అంతరంగాలమీద
ఆత్మలు ఒట్టి శవాలుగా మూలుగుతున్నాయి
పోట్లుతినీ తూట్లుపడీ ముక్కలు చెక్కలై
పగిలిన చూపుల చివర్న నిలిచిన ఆశలై
చెదిరిన కాళ్ళై
కూలుతున్నవి ఎవరి దేహాలు ?
నేను పాడిన పాటలేనా ఇవి
నేను పలికిన శాంతి గీతాలేనా ఇవి
నాకళ్ళ కలలేనా ఇవి
మనిషి కలచుట్టూ
కన్నీటి చుట్టూ
ఈ చీమూనెత్తుర్ల గుట్టలు
చూస్తూ చూస్తూ ఈ నగరాన్నొదిలి పోవాలి
మనిషి గుండెకి అందనంత దూరం

నిజం సుమా
ఈ బస్తీ నేటి నెత్తుటి పుష్పం
మబ్బుల దుప్పటి ముసుగేసుకున్న
సూర్యుడికేం తెలుసు
ఈ రోజు చిరకాల స్నేహం కూడా మతం మడతలో
కత్తుల కటార్ల ఉన్మాదపు దౌడు
నెత్తుటి నదుల్లోకని
ఆస్పత్రులు శవపేటికలయ్యాయని
పాలపెదవుల పసిపిల్లలు
కత్తుల చివర్లనుంచి జారే రక్తసింధువు లయ్యారని
ఖద్దరు ముసుగు తొడిగిన సూర్యుడికేం తెలుసు
మనిషి ఖడ్గమృగమై కుమ్ముతాడని
బీభత్స మృత్యురూపమై సంచరిస్తాడని
వేదాల్లాంటి వీధులకేం తెలుసు
మసీదుల్లాంటి వీధులేమన్నా కలగన్నాయా?
నిశ్శబ్దమై నిదురించే గల్లీల గుండెల్లో
ఓ భయానక రక్తపాతం కురుస్తుందని
కాలం నానుదుటిమీద భయమై పొడిచినప్పుడు
శరీరమంతా నదిలా ప్రకంపిస్తున్నప్పుడు
బ్రతుక్కి కర్ఫ్యూపాస్ రాయించుకుంటున్న మనిషిని నేను
నేనూ ఒక బీమూనెత్తుర్ల పదార్థాన్నైనపుడు
ఎవరి ఆర్తనాదమో శవంలా వచ్చేస్తుంది
నిజమే
ఆర్తనాదం నాదే ఆ శవాన్నీ నేనే
నిద్రపోతున్న రోడ్లకేం తెలుసు
ఇక్కడ మహాప్రవక్తలే మోసపోయారని
హంతకుల చేవ్రాళ్ళు చూశారా మీరెవరైనా?
నిద్రపోయే రోడ్లకు తెలుసా?
నగరానికి నిలువెత్తు శిలువేశారని
ఆదమరిచి నిద్రిస్తున్న నగరానికి తెలుసా
ఇక్కడి వీధుల్లోంచి నెత్తురెందుకు వస్తుందో?

ఇదినేను ఊహిస్తున్న ప్రళయమే కావచ్చు
ఈ శిక్షిత ప్రపంచపు కొమ్మల మీద
జంట జంటలుగా కూర్చున్న మనిషి దేహాలు
ఒక్కొక్కటిగా రాలిపోవడం తెలుస్తూనే ఉంది
ఏవో సందిగ్ధపు గంటలు మాత్రం
మనిషి భయమ్మీద తీతువులై అరుస్తున్నాయ్
ఈ చీకటిమీదకు ఇంకా ఎర్రమంచు రాల్తూనేవుంది
నిద్రపోతున్న ప్రతిక్రీస్తు ఇప్పుడు తనని తాను
తలచుకుని జాగారం చేస్తుంటాడు
వాకిళ్ళలోకి దివిటీల్లా అనుమానపు చూపుల్ని సారిస్తాడు
ఇది మెలకువను చీల్చుకొని వచ్చిన ఉదయమే కావచ్చు
అంతర్నేత్రపు లోపలి గదులకు తగిలిన
బాధమేకు గాయమే కావచ్చు
ఇది అందరూ నడిచిపోతున్న బాటే
కానీ, ఇది కలనుంచి వాస్తవంలోకి
వేళ్ళు సారించి రక్తాన్ని వెతుకుతున్న సంఘర్షణ
ఈ దారి మీదే
లారీల శబ్దాలిలాగే వినిపిస్తే
ఆ గోపురాల గూళ్ళలో పావురాళ్ళు
వాటికి రెక్కలున్నాయన్న సంగతి మర్చిపోతాయేమో
పాలకోసం ఏడ్చే పసిపాప
తుపాకీ పేలిన శబ్దం విని ప్రాణంతో ఎగిరి పోతుందేమో
మనిషికున్న రెండు చేతులూ పొడుచుకునేందుకే అయితే
వాటిని నరకడానికైనా నేను సిద్ధమే
నేను చేతుల్లేని మొండెమైనా ఫరవాలేదు
కానీ, నేను మనిషిగా మొలుచుకొస్తాను

# తల్లావజ్ఝల పతంజలిశాస్త్రి

## ఇతన్ని చూశావా ?

అతను ఎంతో కాలం నుంచీ తెలుసు
చంద్రుణ్ని కళ్ల ఉచ్చులో బిగించి
ఇరవై అంతస్తుల మేడనీడలో
వాహనాల ఇంధన వాయువుల్ని పీలుస్తున్నా
మనసునిండా మంచిగంధం
జేబునిండా చిల్లరలా
నక్షత్రాల నగదు
అతన్ని ఎరిగున్నా నేను

నగరం నడిబొడ్డులో
పూసిన పారిజాతం !
(సూర్యుణ్ని చూసి నవ్వుతూ)
ఎర్రదీపం కాపలా ఎంతసేపు?

తెలియకో తప్పకో
రంగులరాట్నం ఎక్కి
ప్రపంచం నలుసులా కళ్లలో పడగానే
కళ్లనీళ్ళు తిరిగేయి
నిలబడి చూసుకుంటే
తనలో ప్రపంచం తిరుగుతూనే ఉంది

రోడ్డువార నీడలో ఉన్నా
కార్లకళ్ల క్రూరకాంతికి
కంట్లో చంద్రుడు కన్నీరైపోయాడు
క్రిక్రీచు మంది కారు
అంతే—
ఏదో అదృశ్యహస్తం
ఆ గోడమీద గిలికిన
ఎర్రని నైరూప్య చిత్రంలో
అతను......

## తేడా

కీచు గొంతెత్తి
గొంతు ఎండేలా
కంపార్ట్‌మెంట్‌లో గుడ్డిపిల్ల
అపశ్రుతుల ఆకలిపాట.
(కడుపులో నెగడుతో
కూతవేసే ఇంజనులా)

బట్టలకే గాని
ఒంటికి అంటని పేదరికంతో
యౌవన శిలాజం ఆమె
గొంతుకలో
గాజుకళ్ళలో —
ఎదుటి సీట్లో
ఆకలి !!

## ఎల్లోరా ఇంద్రాణి

కాలం నీడలో
వాడని ఆ శిలావల్మీకం కింద
స్మితవదనంతో
ఎవరికోసం ఇంద్రాణి ?
అన్ని యుగాలనుంచీ.
చూడగానే నిన్ను
స్ఫురించిన నట్టయింది.
నిర్భాగ్యుడ్ని. నాకోసం కదూ ?

# చిట్రిప్రోలు వేంకటరత్నం

## శ్రామికుడు

అతను
జ్యోతిశ్శలాక
అతను
స్వచ్ఛతకు సరస్సు
తన దేశం ప్రజల స్వర్ణస్వప్నాలను
స్పష్టమైన సత్యాలుగా అనువదించే
భాషాశిరోమణి
విజ్ఞానఖనుల ఆలోచనలకు
విశద మైన రూపాలు చెక్కే
అపురూపపుశిల్పి
అతను
తరతరాల నాగరికతాచక్రాన్ని
చరచరా కదలించే
సింహసమానబలుడు
అతను పనిలో మునిగి ఉన్న దృశ్యం
ఒక ముని తపోభూమికకు భాష్యం
అవని కంతటికీ అందమైన దృశ్యం……
అర్రెర్రే!
అతని దేహం
స్వేదసముద్రం
అతని జీవితం
శ్రమసముద్రం
అనంతకోటి ఆనందమయ జీవుల అభిలాషలను శిరస్సుపై
ఆదిశేషుడిలా మోస్తుండే వా డతను
అతను ఎప్పుడూ అడుగునే ఉంటాడు
అతను ఎవరు?
శ్రామికుడు.

## ఆర్. ఎం. జయరామన్

### స్వప్నించిన రాత్రి

అంధః దివసం పొడుగునా
సాగిన గల గలా...కల కలా
అక్కడ ఘనీభవ నిశ్చంచల మవుతుంది !
రెండూ రెండు శ్మశానాలై
పడగ్గదిలో మౌనంగా కాలుతుంటాయ్.
అలసిన హామ్లెట్ ఆలోచించడం
మాను కొంటాడు.
జ్ఞాపకాలు కూడా అప్పుడు
యాష్‌ట్రేలో సిగరెట్టు ముక్కలవుతాయ్.
అడవి వదలిపెట్టిన
'హెూమోసేపియన్' ఇంకా ఇంటికి చేరడు.
'షట్ శేషేమ్' అరుపుతో
గుహలన్నీ మూసుకపోతాయి
—ఇప్పటికీ రాత్రి స్వప్నిస్తూనే ఉంది.

# కీ. శే. దిగుమర్తి సీతారామస్వామి

## హిమావి

131

పువ్వులో తేనె ఎంత మధురమైనదైనను
దానికడకు తుమ్మెదలను జేర్చునది పూరేకుల శోభయే.

132

పడిపోయిన చుక్కలతో ఆకాశము పడి పోవుటలేదు.

133

వృక్షము వసంతము వచ్చిన బాగుగానుండునని కలవరించునే కాని
తనజీవితము నందలి చాలభాగ మప్పటికి గడచిపోవునని
తలంచుటలేదు.

134

వికసించిన విరులకే వృంతమునుండి సడలి పోవుదుమని భయము
తొడిమనుండి రాలినవానికి ఎండి పోవుదుమని భీతి.

135

తొడియలోని చేపకు పయోధిని సమీపించుట అతిభయము

136

వర్షించుటకు జలము లేకపోయినను
వర్షాంతమేఘము చాయను కలుగజేసి
సస్యముల కుపకరించును.

137

పంజర మెంతపెద్దదిమైనను
పంజరపుటూచలు మాత్రము క్రిక్కిరిసియే యుండును.

138

పరిమళమును వహించు కర్ణిక
ప్రసవ గర్భమునదాగియుండును.
పత్రములను వహించు తొడిమెయో
పైకి కన్పట్టుచుండును.

139

కాలమను నాణెమునకు ఒకప్రక్కనుండు అక్షరములు మక్కలు
రెండవ ప్రక్కనుండు బొమ్మ సూర్యుడు

140

సుకృత సుమములచే నిండియున్న
మానవ జీవితపథములందు మాత్రమె
కీర్తికోమలి విహరింపగలదు.

141

పంజరము, ఏవైపునకు పోనీక
తన కౌగిట నుండుమనుటచే,
పక్షికి పంజరముమీద అణుమాత్రము
ప్రేమయుండదు.

142

విటపమున నున్నప్పుడు
విరినిజూచి యానందించు కరువలి
వృక్షచ్యుతమగునపుడు పువ్వును
పడకుండు నటుల పట్టుకొనదు.

143

ప్రకృతి : "కవీ ! నీవెన్ని మారులు వ్రాసినను
ఈ అక్షరములే కదా !"
కవి : ప్రకృతీ ! నీవెన్ని మార్లు మార్చినను
ఈ ఋతుపవనములేకదా !"

144

ఆకసమునుండి పడిపోయిన మంచుబిందువు
నక్షత్ర నిరాధార జీవితమునకు విచారించును.

145

కందిగింజపాతిన, మొక్క, మరిపది
కందిగింజలు లభించును ;
రత్నము పాతిన మరి పది
రత్నములు లభింపవు.
కనుక, రత్నము తృణకణాయ మానమని
కర్షకుని తీర్పు !

'మృగమును హింసించునది బాణముగాని నేనుకాదు'
అనివేటకాడనెను.
కొందఱు తమ తప్పును పరిజనులపై పడవైతురు.

147

చేతనున్న దీపికవలె, దూరముననున్న నక్షత్రము
ఉపయోగకారిగానుండదు.

148

సైరికుని నాగటి చాలులలో
సర్వేశ్వరుని యడుగులు కనిపించును,
సార్వభౌము రథచక్రముల జాడలలోకాదు.

149

మెఱపు హృదినుండి అప్పుడప్పుడు పిడుగులు పడినను
నెమలి మనస్సుకు కష్టము కలగదు.

150

మిడుగురు కాంతిలో మిడుగురు నీడపడును
సూర్యకాంతిలో సూర్యుని నీడపడదు.

151

చేప, గట్టుమీద పడినప్పుడు
నదీజలముల విలువ తెలియును.

152

వృక్షము లానందింపని మాత్రమున
పికము పాడుట మానదు.

153

బద్ధమై పంజరములోనుండి చూచు పక్షిదృష్టికి
బాహ్యాకాశము తునకలుగా కన్పించును
హాయిగానెగురు శకుంతమునకు
ఆ యాకాశమే అపారముగా కన్పట్టును.

154

ప్రభాతమున విచ్చివీగి బయలు చూచుపద్మము
నీటియందు తననీడను తెలిసికొననేరదు ;
తలవంచుకొని యోచించు కలువ
తననీడను తెలిసికొన గలుగును.

155

రాత్రి కాల మగునప్పటికి
చంద్రుడాప వలెనని ప్రయత్నించినను
చంద్రికలా దశదిశల నాక్రమించును.
ప్రభాతమందు మాత్రమే
చంద్రుడువాని నుపసంహరింపగలడు.

156

ప్రేయసి : "నీ హృదయము మంచువలె కఠినమయ్యు
మంచువలె సులభముగా కరగిపోవులు."

157

ఆకాశము, ప్రత్యూషమునకు
అన్నితారకారత్నములను దానము చేసియు
మౌనమే వహించును.

158

ఇలకు విలయము
జలనిధులవలననే సంభవించునుగాని
సెల యేరుల వలన కాదు.

159

"రాత్రి నక్షత్ర మాలికలధరించితి"నని
ప్రభాతాకాశము పలికినప్పుడు
మంచుబిందువులనెపమున
పచ్చిక బయళ్లు పరిహసించినవి.

## 160

వాతాతపములనుండి
పత్రములు తన్ను రక్షించుచున్నవని
వాని పోకడలనే లతాంతము గ్రహించును.

## 161

నిదాఘాతపమును భరింపలేక
నిమ్నగలు ఇంకి పోవు
సెలయెల్లే జీవనమును త్యజించును.

## 162

సముద్రపుటొడ్డున నున్న రూప జీవనము వలె
శరుని కడనున్న మనుష్యజీవనము నిర్మాధుర్యము.

## 163

కాకి యింటిచుట్టును తిరిగి అపరిచయురాలైన కోకిల
తనపాట తీయ్యదనము చేత పరిచయురాలౌను.

## 164

శరద్ హాసమే ఘనీభవించి
హేమంత వసుంధరాంకమున
హిమానియైనది

## 165

గగనమునందు కొనుటయందు విఫలములై
కడలి తరగలు గట్లను గగ్గోలు సేయును.

## 166

రాజ మమునకు పేరు
ఫల కుసుమ వృక్షముల వలననే వచ్చునుగాని
పచ్చిక పూవుల వలనెకాదు.

## 167

తోటలోని వృక్షము లెదు గుటకు
తోటమాలి కష్టించవిన,
వాని నీడలందు పచ్చిక
తనంత తానే ఎదుగగలదు.

## 168

అధఃపతన మొందవలసి వచ్చినప్పుడు
ఆకాశమునందలి చుక్కకును
అవనిజము నందలి పుష్పమునకును
విచారము సమానమే.

## 169

భూపతితములైన పిదప
రిక్కకును కన్నీటి చుక్కకును భేదమేమి?

## 170

నదీ గర్భములోని నిమ్నోన్నతములను
నదీ జలములు పైకి గాన రానీయక
సమముగ జేయును.

## కొండిబోయిన ఆంజనేయకుమార్

### నాన్న పోయినప్పుడు

నాన్న పోయినప్పుడు
పెరట్లో చెట్టు తన నీడమీదకి
తానే ఒరిగి పోయింది.
అభిమాన హీరో రంగుల బొమ్మలతో
నే నలంకరించిన ఆ గోడలు
నా ఏడవటం చేతకాని తనానికి
చారలు చారలు కట్టాయి
ఎవరివో రెండు చేతులు
గోడనుంచి నన్ను విడదీస్తూ
శవం మీదకు తోసాయి...
ఏడవటం నేర్పిస్తున్నట్టుగా
నాన్న పోయినప్పుడు
నేను ఆయన తలదగ్గర దీపం కాలేక పోయాను.
ఆయన కాళ్ళదగ్గర అగరువత్తులు కాలేక పోయాను.
ఎందుకంటే ... అవి అమ్మలాగే నిరంతరం
అగ్ని శిఖ వలయాలుగా ఏడుస్తున్నట్లు ఉన్నాయి
నాలాగే తెలియని తనంతో
నా కంటిపై మగతవాలి రెప్పల్ని చేరవేస్తున్నపుడు
అమ్మా తట్టి లేపి
"తప్పురా కన్నా
నాన్న రేపు లేవని నిద్ర పోతున్నారు
నీవు రేపు తర్వాతే నిద్రపోవాలి" అన్నది
అమ్మా నేను అక్కా చెల్లీ
పూసిన కన్నీళ్ళని కడిగేయడానికి కాబోలు
నాన్న మీద బిందెల కొద్దీ నీళ్ళు పోసారు.
నా చిటికెన వేలు పట్టుకొని

నడక నేర్పించిన నాన్నని
నేను నిప్పులముంత పట్టుకొని
"అగ్నిశయ్య" పైకి నడిపించాను
అమ్మ కొట్టినపుడు
కన్నీళ్ళు తుడిచి, తలనిమిరి ఓదార్చిన నాన్నకి
తలకొరివి పెట్టాను.
నాకు దేహమిచ్చిన నాన్న దేహాన్ని
నేను దహనం చేసాను.
ఈ పుణ్యభూమిలో
కొడుకుగా పుట్టడం ఎంత పాపం? ఎంతనరకం?
కూతురిగా పుడితె ఇంటిదగ్గరే ఏడ్చి ఏడ్చి
కన్నీళ్ళ తలస్నానం చేయవచ్చు.
నీటికుండతో ప్రదక్షిణం చేసిన నేను
చివరికి ఆ నీటి కుండనేఅయ్యాను.

# సుమనశ్రీ

## అయినా మీకు తెలీనిదేముంది

అయినా మీకు తెలీనిదేముంది. నా సంచీలో రెండో మూడో పుస్తకాలుంటాయి. ఒక పెన్నూ చిత్తుకాగితమూ ఉంటుంది. ఏ బస్సో జీపో ఎక్కి ప్రయాణం చేస్తున్నప్పుడు ఏదో ఒక అక్షరం చెవిలో దూరిగోలపెడుతుంది.

ఆ అక్షరాన్ని అలాసాగదీసు కుంటూ గుండెను పిండుకుంటూంటే నా ఒక్కోరక్తపు బొట్టూ ఒక్కో అక్షరాన్ని పుష్పిస్తుంది. అర్థంకాని అనుభవాల మధ్య కళ్ళలో కదిలేదృశ్యం నా పద్యంలో పడి అదృశ్యంగా కొట్టుమిట్లాడుతుంది.

ఒక చిన్నబిందువు చుట్టూ పెద్దబిందువు నా అనుభవం.

పెరిగి పెరిగి పెద్దదయిన కోరిక నీటి బుడగలా పగిలినప్పుడు తప్ప అనుభవ చిత్రంలోని నిస్సహాయత నాకు బోధపడలేదు.

నీటిలోకి దిగాలంటే నీటిని పట్టుకున్న నాచునూభరించాలి. గజ్జికత్తుల రక్తస్రావాల్ని ఆహ్వానించాలి. బుడగలా పగిలే ఆవేశాన్ని అనుభవించాలి.

పైనపడేవర్షాన్నీ అలలమధ్య ఊపిరిపీల్చే అనంత సౌందర్యశృంగార సముద్రాల్నీ

నీ ఆయువు పట్టుదొరికించుకొని నిన్ను ఊబిలోకిలాగే వాల్ పోస్టర్నీ దానికి ప్రాణం పోసే అర్ధనగ్న సుధాబింబాల్నీ తీపితీప తలపోతల సౌఖ్యానందభైరవినీ

నందనవనంలో పొర్లించే అనుభూతుల మొగలి పొదల్నీ తట్టుకొని నిలోచ్చగలగాలి.

ప్రతినిత్యం వినూత్న అనుభవాలకోసం నా గాలి గొడుగు తెరుస్తూనే ఉంటాను. ప్రకృతి వొలకబోసిన అమృతం నాలో వేనవేల కవితల్ని పొదుగుతుంది.

ఏ స్వప్నాన్నీ కాదనలేను కనకనే నానరాల్లో అంతటి ప్రకంపన.

ఆస్వాదిస్తున్న కొద్దీ అనుభవం అనుభవంకోసం ఉవ్విళ్ళూరుతోంది. పైనబడ్డ చినుకు వెన్నుపూసలోంచి జారి పోయినంత వొణుకు. జిల్లుమన్న నరం సితారామీద పాటపాడినంత పరవశం

ఎలాంటి అనుభవాలు కావాలి నీకు—

మనసెప్పుడూ మత్తు మందునే కోరుకుంటుంది. అందం ఒక మత్తు

మందు. వేదు మందూ మత్తు మందే. గొంతులోకి దిగితే పాలు అన్నమూ జీడిపప్పు పరమాన్నమూ మత్తుమందే—

ప్రతి అనుభవమొక వ్యసనంగా మారేంతవరకూ ఈ జీవితం అర్థంకాదు.

వ్యసనానికి నిర్వచనంకోసం ఎన్ని సముద్రాలు దాటి వెళ్ళనో నీకు తెలుసా.

అస్తవ్యస్త జీవితంలో ఏ అనుభవం ఎంత తృప్తి ఇస్తుందని నన్నడక్కువాణ్ణీ అడక్కు.

అసంపూర్ణ మానవత్వం ఏ స్వర్గాల్నీ సృష్టించలేదు. ఏ నిసర్గ సౌంద ర్యాన్నీ ఆస్వాదించలేదు.

విషాహారాన్ని సైతం విడివిడిగా భుజించే వాడికీ వీడికీ ఆత్మ స్థైర్యాల అనుభవసారాన్నెలా అందిస్తావు. నీళ్ళు కూడా దొరకని ఊళ్ళో నిప్పుల కుంపటితో ఏం చేసుకుంటావ్. నాలాంటి అల్పబుద్ధుల అనుభవాల్లోంచి ఏ జీవన సారాల్ని పిండమంటావ్.

* * * *

నా సంచీలో పుస్తకాలు కాస్తంత ఊపిరి పీల్చుకున్నట్లున్నాయి. నా ఆలోచనలు తెగి అటూ ఇటూ చూస్తున్న నన్ను ఆప్యాయంగా పల్కరించే బాల్యస్నేహితులు అవే—

అంతులేని అనుభవాల చిరునామా చూపించేవీ అవే.

నా ఆలోచనల్ని మృత్యువునించి కాపాడేవీ అక్షర శిల్పంమీద నా ఆకాంక్షని విస్తృత పరిచేవీ నరక లోకాల శిక్షాస్మృతుల్ని అమాంతం కప్పేసి ఎక్కలేని పర్వతాల్ని ఎక్కించే కలికాల కాలకూట విషకన్యలవి—

కలంకాగితం నాలో పగటి కలల్ని సృష్టిస్తాయి. కలలోంచి వినపడే కలకలం నాలో రంగుల ఇంద్రధనుసుల్ని పుష్పిస్తుంది. చీకటి రహస్యాల చిద్రూపాలన్నీ కురుస్తున్న వర్షంలోంచి వచ్చి నా జేబుల్లో అక్షరాల మధ్య దాక్కుంటాయి.

ఒక కప్పు కాఫీ తాగే లోపల ఆలోచనలన్నీ ఆవిరై పోతాయి. విడివిడి అక్షరాల్లా కుప్పకూలి పోతాయి.

విరామం విరోధాభాసాలంకారమౌతుంది.
ఆఖరి శ్వాసకి బలై గీపెట్టి అరుస్తూ అరుస్తూ
మరే ఆలోచనావెలగని చెమ్మలో
చెవిలో విన్పించే మంత్రం ఆగిపోతుంది
సూత్రం తెగిన గాలిపటంలా నా పద్యం
ఏ ఎలక్ట్రిక్ తీగకో తగులుకుని వర్షంలో తలంటుకుంటుంది మెల్లగా.

## ఉత్పల సత్యనారాయణాచార్య

### పాత బస్తి

ఈ పాత బస్తి ఎన్నేండ్లదో కాలంపు
గడిదొంగ దోపిడీ పడిన యిల్లు
ఈ పాతబస్తి ఎన్నేండ్లదో సౌంపారి
లొత్తబుగ్గల ముదిపొత్తుటాలు
ఈ పాతబస్తి ఎన్నేండ్లో విరియబూవి
పురుగుపట్టిన గులాబుల పొలమ్ము
ఈ పాతబస్తి ఎన్నేండ్లో యెండి విపికి
రం గింత చెడని నా రంగ ఫలము
వీథులవి సందుగొందులై వీటిపోయె
సభ్యతాసభ్యతలు నొక్క చక్కి నొదిగె
జీవకళ లిప్పటికిని శేషించినట్లు
శిథిల గృహముల జిల్లేడు చెట్లు మొలిచె

దారు శిల్పకళా శోభితమ్ములయిన
ద్వార బంధాలు చిత్రవాతాయనములు
పతన దశనొందినను గాని పట్టువిడక
బాటుచున్నవిపో! శాంతి సహనములను

ఇహభోగంబులనెల్ల కొల్లగొని యిందేమెక్కియుఁ ద్రాగి ఏ
మహరాజో మునుపుండిపోయిన పురామ్లానశ్లథాసౌధపుం
బ్రహరీ గోడల పంచదించుకొని పెఁ పట్టాలనుంగట్టి ప్ర
త్యహముఁ కాపురమున్న పేదలెవరయ్యా! పాతబస్తీ జనుల్

జలతారుం బరదాలు దార్చిన గవాక్షాలఁ ప్రతీక్షాదృగం
చలయై ఏ జవరాలు మేల్మొసుగులోనం బుచ్చు నిట్టూర్పు గా
డ్పులు ఇచ్చోట ఘనీభవించినవియేమో కాని శేఫాలికా
కలికాకోశ కషాయగంధముల నాఘ్రాణింతు మిప్పట్టునన్

అమ్మేలి ముసుంగున వ్య
క్తమ్మగు మోచేయినిండు గాజులుగల కెం
దమ్మికరంబులకుఁ పూ
లమ్మినయెడ నేడు కట్టెలమ్ముమనుండెన్

నలువంద్రిచ్చట మానవత్వమును మంటఁగల్పి గగ్గోలుగా
ఎలుగెత్తింపిన ఘోర దుర్ఘటనలెన్నెన్నో! మతోన్మాదినీ
మలిన క్రూరకరాసిచే నిట గులాంయాసీం కవిశ్రేష్ఠు గుం
డెల రక్తమ్మది మొండిగోడలకు విందైఁ లోకమల్లాడగన్

ప్రాణభయంబుచే పరదయాగతి కెంత తపింతురో పర
ప్రాణులమీద నంతటి దయన్ పరపింపరె! ఈ జగంబులన్
ప్రాణముకంటె ప్రీతికరమైన పదార్థము లేదు, తత్పరి
త్రాణముకన్న మేలయిన ధర్మము లేదు తలంచి చూడగన్

తత ముచికుంద తల్లి పురతస్థితయై కటిమాత్రవస్త్రయై
వెతల జితించు వెన్నెముక వీపును డొక్కలుగూటియెమ్ములర్
దతుకులు కానరాగ వరుగై తనకుం గల ఒక్క రైకనున్
ఉతుకుచునున్న జవ్వనికి ఉన్నద? ఇంచుక మంచికాలమున్

సన్నని సందు గుల్మహాలు సంగడి బొగ్గులకొట్టు దాని కా
సన్నము కాగనున్నది కసాయి దుకాణము, దాని ప్రక్కనే
ఉన్నత పాఠశాల, మరియున్ తొడ త్రొక్కిడితో నిరంతరం
బున్నెసగూటి సందడి ప్రభుత్వపు కల్లు దుకాణమొప్పెడిన్

స్కూటరు వచ్చి సైకిలిని గ్రుద్దెను, స్కూటరు బండి నప్పుడే
అటో ఒకండు గ్రుద్ది హతమార్చెను, అటోను బస్సుగ్రుద్దె, ద
బ్బాటుగ లారి పైనబడి బస్సును రూపడగించె, వీధిపో
రాటమునందు నిప్పటికి లారిని మించిన రౌడి లేదిలన్

పెరడు బిరాన దాటి మడిబిందెలపై తడిబట్ట కప్పిన
ట్లురు కుచకుంభపాళిపయి ఉల్లిపొరం బురడించు వస్త్రముం
బరచి కమీజునున్ బిగుతు పైజమదాల్చిన కుఱ్ఱదోర్తు తా
బిరబిర వచ్చి నన్నని శపించెను నా మది మూఢమై చనన్

పేద వెయ్యిసావె పెద్దమనిషి జేబు
వెదకె సిగరుబాక్సు వెలికి తీసె,
మరొక జేబు వెదకె మాచిబాక్సును తీసె
భగ్గుమనెను పేదవాని గుండె

విటుడు పొగత్రాగు, జరదాను వేశ్య నమలు
మూర్ఖు డదిచూచి పీల్చును ముక్కుపొడుము
అనుకొనుచు నటనిల్వకా వెనుక నడువ
సాగితిని సారంగమువంటి సందున బడి

తమ్ముల పుటుమ్మి పైబడి తడుతు నన్న
వెరపుచేత ఆ ఇరుకై వీథియందు
తప్పుకొనిపోవ, ఒక్కెత తలుపు తీసి
చేయనే చేసె ఘోర నిష్ఠీవనమ్ము

కోపమూనితి నాకామె రూపు రేఖ
హర్షమొదవించె తశ్ళ్రథిలాంశుకమ్ము
శ్వాస కంపితమైన వక్షస్థలమ్ము
యామ పర్యంత శయన సంయమిత కబరి

పాత బస్తి ఇద్ది బాగుచేయక యున్న
నగర జీవితమ్ము నాశనమ్మె
కల్లుపాక నిప్పు చెల్లార్పకుండిన
యజ్ఞశాల కద్ది అంటుకొనదె!

విధుబింబము కనుపట్టెను
శ్లథమెరుగని బార్మినారు సౌధోపరిపై
విధురాధుర మకరధ్వజ
వధూకర గృహీత శీధుపాత్రిక పోవెన్.

# బాలగంగాధర తిలక్

## శర్వరీప్రియ

రావే నల్లని దాన నా మనసులో రాసాడు శోకాకృతీ
వేవేల్ చుక్కనరాల దాల్చికొను నా వింతైన యిల్లాల, ని
ద్రావేశమ్మున లోకమెల్ల జడభూతమ్మయ్యె మేల్కొన్న నా
ఆవాసమ్ము రహస్య మిచ్చుటకు నేకాంతమ్ముగా రా చెలీ.

ఇంత చీకటి చిమ్ము వింత పెన్నెరులలో
నెలవంక మొగలిరేకుల రచించి
ఆరని మంచుముత్యాలతో కటిసీమ
మురువుగా మొలనూలు సరణి దీర్చి
శ్రవణావతంసమై జారు కల్హారమూ
లారజమ్ముల దారులందు జల్లి
కోటి స్వప్నాలయ గోపురాంచలములు
కడగంటిచూపుల గడలుకొనగ

రావె తాపింఛ తరువాటి రథ్యలందు
రావె హిమసిక్త శాద్వలారామవీథి
రావె మిణుగురు లద్దిన రమ్యచేల
ముల కొసలు నేల జీరాడ మోహనాంగి!

పడమట సంద్రాన పడినంత భానుండు
లీలగా కదలె నీలాల కురులు
పంక్తిగా విహగాళి పయనించు సమయాన
నుదుటిపై తోచెను మొదటిచుక్క
బెదరుగా వనవాటి నొదుగ నల్లని నీడ
కచపాళి బాలేందు రచన సౌరు.
కీచురాల్ స్వాగత గీతాల పచరింప
చీకటిగజ్జెలు చిందు రవళి

నీవు గతకాలమవు నీవు నీరవమవు
నీవు శూన్యమాకృతివియు నేడు రేపు
తిరిగి నీలోన కలసి గుర్తింపరావు
రాత్రి! లేదు నీ కన్న వల్లని నిజమ్ము.

ఇపుడు రెండవజాము హ్రీపరిమ్యత దిశా
భామిని నగ్నభావమున నిలిచె
ఇపుడు కౌగిలివిడి యేడ్చు చున్నది నిదు
రించు విటుని పజ్జ లేతవేశ్య
ఇపుడు మూసెను కన్ను లీ సర్వరాజ్యము
నాహరింప దలచు నాయకుండు
ఇపుడు భైరవనాద మెక్కడో చెల రేగె
కాలగళుని కాలిగజ్జె జార

ఇపుడు తమమెల్ల శ్రవణమై యొసగి వినియె
యుగయుగాల బాధలనెల్ల నోర్చి ఓర్చి
నెరదలైనట్టి ధాత్రీప్రణీత హృదంత
రమ్ము విడివచ్చు ఆక్రోశరావ మొండు.

నేను నిశీధిమధ్యమున నిద్దురపోవను లోని వేదనా
జ్ఞానము గుండె కాల్చి కడకన్నుల నావిరి యావిరై చనన్
మౌన తపమ్ములో నిలిచి మానిని యూర్పుల వాడి సూదులన్
లోనికి గ్రుచ్చి నీ నలుపు లోపలివెల్గును చూడ నెంచెదన్.

నాకును నీకు మైత్రి ఒకనాటిదికాదు కృతాంతమందు వా
ల్మీకుల శోకమందు మిథిలేశునిపట్టి విషాదబాష్పంబు మ
దాకృతి దాల్చెగాక, మరి నవ్య శిరీష మృదుత్వ మీ హృదిన్
ఏ కలలెన్ని దగ్ధమయి యీ పొడి బూడిద కొండలై చనెన్.

రాసులు రాసులై పొదలు రక్కెస చీకటిలోన నేనవి
శ్వాసిని సంశయాశువును సంతత సత్యగవేషణా మనః
కౌశికునిట్లు నిల్చితిని, కారుణికమ్ము కవిత్వమంతరో
ల్లాస విలాసమై వెలుగు లాజలు జల్లునటన్న ఆసతో.

నవవికచ కల్హారముల గంధానిలమ్ము
లరవిరియు సన్నజాజుల పరిమళము
లొలయ నీమేన రారమ్ము వలపు నింప
మూలగా గదిలోని నాప్రోల కిపుడు.

చిత్తుగా త్రాగివచ్చిన శ్రామికుని కన్ను
రెప్పలమైకమ్ము రేక హత్తి
జారచోరగణము స్థైర్యమ్ము నిలుపగా
క్రమ్ము చీకటి కవచమ్ము కూర్చి
పతివియోగాసహ్య బాధానరకసీమ
తల్లడి ల్లుతికి నిద్రను ఘటించి
పాడింటి అరుగుపై పడి గతించిన ముష్టి
ముసలిపై వలని ముసుగుకప్పి

జరగిపోయిన నాటి మధుర దినాల
స్మృతుల తలచి తలచి బాష్ప సూక్తులాడు
విధుర జీవని కేకాంతవేళ కూర్చి
రమ్ము భావదుఃఖితుడ నా ప్రాంగణముకు.

పాపకార్యాచరణులకు ప్రబల శప్త
జీవులకు దుఃఖ సంతప్త దీనులకును
నీవు లేకున్న ప్రాణముల్ నిలుచు టెట్లు
అంధకారసుందరివి మా అనుగు చెలివి.

నీలోన వెదేహి నిందాచరిత్రమ్ము
జాలిజాలిగ కర్ణపాళి సోకు
నీలోన క్లియొపాత్ర నీహార సౌందర్య
మలసి వ్రాలిన విషాదాంత మొరయు
నీలోన ఫల్గున లాలితాస్ఫాలిత
గాండీవ గుణశబ్ద గానమొలుకు
నీలోన సుగతుని నిర్వాణవేళావి
మూఢ జగద్దైన్యమూర్తి తోచు

నీవు నేను నదృష్టాధ్వనీనుల మిరు
వురము సాగింతు మీ యాత్ర విరము, స్థిరము
విరమునైన వేకువ వెల్గు చేరుదాక
మరల రాతిరి పడనట్టి మంచిరోజు.

ఓసి నిశాచరోత్సవ మహోదయమా! గతకాలగాథ ని
శ్వాస రహస్యమా! భవుని స్వాంతములో మొదలింటి ఊహలో
పోసిన శిల్పమా! సమత మూర్తినిగొన్న దయానిధానమా!
నా సఖి! రాత్రిరాజ్ఞి! స్వరణైక సుఖప్రదశాలినీ నమః

మెత్తని పట్టుచీకటుల మేలిమి దుప్పటిలోన కౌగిలిన్
ఒత్తుము, నాకవోల గళ దూర్మికలైచను బాష్పవారితో
హత్తెద నీ యురమ్ము తడియై ఒకవింత సొబంగు దాల్ప-యీ
మత్తున జోలపాడి నను మైమరసింపుము శర్వరీ ప్రియా!

# చైతన్య కవితా వేదిక

## బెంగుళూరు

అధ్యక్షులు : శ్రీ డి. కె. ఆదికేశవులు
ఉపాధ్యక్షులు : 1. శ్రీ బుల్లాసుబ్బారావు, ఐ.ఎ.యస్.
2. శ్రీ సకలా నరసింహులు
3. శ్రీ కరుటూరి సూర్యారావు
కార్యదర్శులు : 1. ఆచార్య తంగిరాల సుబ్బరావు
2. ఆచార్య ఆర్వీయస్. సుందరం
కోశాధికారి : ఆచార్య సరగు కృష్ణమూర్తి
సహ కార్యదర్శులు : 1. శ్రీ పి. యు. బి. శర్మ
2. డా. ఎం. రుక్మాంగదనాయుడు

## 1991లో చేరిన సభ్యులు

### () పోషక సభ్యులు

శ్రీయుతులు—

1. వై. వెంకటరెడ్డి, మేనేజింగ్ డైరెక్టరు,
శ్రీ చాముండేశ్వరి షుగర్స్ లిమిటెడ్, బెంగుళూరు-42
2. కె. చంద్రప్ప, ఆంధ్రోపన్యాసకులు, వీరశైవ కళాశాల, బళ్లారి.
3. తేజేశ్వరి, శ్రీనివాసమూర్తి దంపతులు, బెంగుళూరు.
4. సత్యవతి, డా. వి. వెంకటరాజు దంపతులు, తణుకు.
5. చూడామణి, శ్రీనివాసాచార్యులు దంపతులు, విజయవాడ.
6. కీ. శే. ఎం. పద్మావతమ్మగారి జ్ఞాపకార్థం వారి తమ్ముడు
ఎం. రామనాథం నాయుడు, అప్పినేపల్లి. చిత్తూరు జిల్లా.
7. పి. సాంబశివాచారి, తెలుగు పండితులు,
కక్కదాసం, ధర్మపురి జిల్లా, తమిళనాడు.

8. సి. నారాయణప్ప, తెలుగు పండితులు,
కామనదొడ్డి, ధర్మపురి జిల్లా, తమిళనాడు.
9. సుబ్బరత్నమ్మ, ఎం. రంగనాథం దంపతులు,
హిందూపురం, అనంతపురం జిల్లా.
10. గండ్లూరి దత్తాత్రేయశర్మ, ద్రోణాచలం, కర్నూలు జిల్లా.
11. ఎ వెంకటరమణప్రసాద్, తెలుగు పండితులు,
హనుమాన్ జంక్షన్, కృష్ణా జిల్లా.
12. టి. మునిరత్నమ్మ, ఎన్. మునిరత్నంరెడ్డి దంపతులు, తిరుపతి.
13. సి. హెచ్. మారుతి, వి. సురేంద్రనాథ్ దంపతులు,
బెంగుళూరు-54.
14. జోస్యుల సదానందశాస్త్రీ, అనంతపురం.
15. పి. శ్రీనివాస గురుమూర్తి, తెలుగు పండితులు, కర్నూలు.

## (ii) జీవిత సభ్యులు

శ్రీయుతులు—

1. త్రిపురనేని శ్రీనివాస్, విజయవాడ.
2. కంభంపాటి కనకరత్నం, హెడ్‌మాస్టర్,
ఆకివీడు, పశ్చిమ గోదావరి జిల్లా.
3. ఎ. కామేశ్వరశర్మ, కేశనకుర్రు, తూర్పు గోదావరి జిల్లా.
4. ప్రొ॥ టి. రామకృష్ణ,
క్యాలికట్టు విశ్వవిద్యాలయం, క్యాలికట్టు, కేరళ.
5. పి. జయమ్మ, మద్రాసు.
6. బొప్పకట్ల చంద్రమౌళి, వేములవాడ, కరీంనగర జిల్లా.
7. డా. భమిడిపాటి విశ్వనాథ్, వారాణసి.
8. ఎం. బసవరాజు, కంప్లి షుగర్ ఫ్యాక్టరీ, బళ్లారి జిల్లా.
9. చల్లాసీతామహాలక్ష్మి, ఉపాధ్యాయిని, యనమదల, కృష్ణాజిల్లా.
10. డా. యస్. యల్. నరసింహారావు,
ఆంధ్ర శాఖాధ్యక్షులు, హిందూపురం, అనంతపురం జిల్లా.
11. పి. లక్ష్మీనారాయణ, ఆర్.కొట్టల,
రొద్దం పోస్టు, అనంతపురం జిల్లా.

12. ఎ. పి. ఎస్. భగవాన్, లంకలకోడేరు, పశ్చిమ గోదావరి జిల్లా.
13. ఎస్. మల్లికార్జున, రొల్ల, అనంతపురం జిల్లా.

### (iii) ప్రత్యేక సభ్యులు

శ్రీయుతులు—

1. ఎం. వి. రాయుడు, సుబ్రహ్మణ్యనగర్, బెంగుళూరు-21.
2. డా. ఎల్. చక్రధరరావు,
   ఆంధ్ర విశ్వవిద్యాలయం, వాల్తేరు, విశాఖపట్టణం.
3. మంగళగిరి ప్రమిలాదేవి, ఆంధ్రోపన్యాసకురాలు,
   మచలీపట్నం.
4. ఎ. సూర్యప్రకాష్, ఉపన్యాసకులు, హైదరాబాదు.
5. ఎ. ఎ. స్వామి, పెనుగొండ, పశ్చిమ గోదావరి జిల్లా.

